# ముందుమాట

దీర్ఘదర్శి, యోగి, తాత్వికుడుకూడ పవిత్రమైన సంఘములో — పూర్ణపురుషుడు కావాలని యుగ యుగములుగ కలలుకనిరి. ప్రస్తుత మానవుడు చాలా దిగజారిపోయెను. అందుచే తనలోను, తనచుట్టు వున్న వారిలోను అభివృద్ధికరమైన పవిత్రతను తప్పక సిద్ధింప జేసికొనవల యును. ఇది, తన చేతనను — సంకుచితమైన మానసిక ఇంద్రియ వ్యాపా రముల సరిహద్దుల నతిక్రమింప జేసికొనుట ద్వారా సిద్ధించును. తాను పవి త్రుడు కావలయునా, లేక అపవిత్రుడు కావలయునా యనునది, ఆయా వ్యక్తి యొక్క చేతనయే నిర్ణయించుకొనును.

వేదకాలపు జ్ఞానులు 'ఋతంజ్యోతి'ని గురించి చెప్పియున్నారు, అనగా (సత్యజ్యోతి) దివ్యజ్యోతి. ఈ దివ్య జ్యోతిని పొందిన మానవుడు, అమరు డగును, వానికి పరమ జ్ఞానము కలుగును. శక్తి, పరమానందములు లభించును. అటులనే ఉపనిషత్కాలపు ఋషి దానినే 'మహస్' అని అనిరి, అనగా మనోమయ స్థితులకు పైభాగమున విజ్ఞానము గలదనిరి. అది శోభాయ మానమైన జ్ఞానమును, ముక్తిని (బంధములనుండి తొలగించుట-స్వతంత్రుని జేయుట) ప్రసాదించుననిరి. ప్రస్తుత కాలమున శ్రీ మాతారవిందులు, యీ పురాతన విశ్వాసమునే పునరుద్ధరించిరి. మానవునికి సదవకాశములను అన్నిటా అంతటావిస్తృతపరచిరి. మహోన్నత చేతనత్వము అధికమగుచున్న కారణ ముగ మానవునిలో అభివృద్ధికరమైన పవిత్రత వికసించుట తథ్యమని తెలిపిరి. మనస్సుయొక్క ఉపరితలమున ఆధ్యాత్మిక సత్యశక్తియొక్క స్థానమున్న దనిరి. అదే అతిమానసము. ఆ సత్య చేతనతను యీ భూమిపై ప్రతి ష్ఠింపజేయగల కాలము త్వరగా సమీపించుటకు అవసరమైన కృషి చేసిరి.

ఈ పుస్తకము, ఆ మహోన్నత జ్ఞాన విధానములను — వివిధ మార్గ ముల విపులీకరించుటకు ప్రయత్నించినది.

— యం. పి. పండిత్.

# మా మాట

శ్రీ అరవిందుల జన్మదినము— అత్యంత, పరమ పవిత్రమైన పుణ్యదినము. ఈ దివ్యదినమును గురించి శ్రీ తల్లిగారు యిట్లనిరి:— "భౌతికముగను, మానసికముగను, ఆంతరంగికముగను, ఆధ్యాత్మికముగను కూడ అత్యంత ఉన్నతస్థానమలంకరించిన" దనిరి. సృష్టియొక్క చరిత్ర యందు సువర్ణాక్షరములతో శాశ్వతముగ లిఖింప బడిన దినము- ఆగష్టు ౧౫. అట్టి యీ శుభదినమును పురస్కరించుకొని, శ్రీ అరవింద సొసైటి తెలుగు శాఖ యీ చిన్న పుస్తకమును తెలుగు ప్రజలకు పరిచయము చేయుచున్నందులకు ఆనందిస్తున్నాము.

ఇందలి వ్యాసములు లోగడ, 'అర్క' త్రైమాస పత్రికలో 1969 నవంబరు మొదలు 1971 ఆగష్టువరకు వరుసగ ప్రచురింప బడినవి. ఈ చిన్న పుస్తకము శ్రీ యం. పి. పండిట్ గారిచే వ్రాయబడిన The Teachings of Sri Aurobindo- (శ్రీ అరవింద బోధలు;) ఆంగ్ల గ్రంధము నాధారముతో తెనిగింపబడినది. ఇది శ్రీ అరవిందుల పూర్ణ యోగమునకు సంబంధించిన విషయములను కొంత వరకు వివరించగలుగునని విశ్వసించుచున్నాము.

---

ఆగష్టు 15 — తెలుగు శాఖ

# శ్రీ అరవిందాశ్రమము : పూర్ణయోగము

సాధారణముగా ప్రపంచ జీవితమునకు దూరముగా నుండునదే యోగ మని ప్రజలు తలచెదరు. ప్రపంచ జీవితము కష్టములతో నిండి, అవిద్యచే ఆవరింపబడి, అసమగ్ర జీవితముగా యున్నది. అందువలననే ఈ ప్రపంచము సత్యపునాదులమీద లేదని యనుచున్నారు. కాబట్టి ఎరుకతో ఈ ప్రపంచమును వదలి, లౌకికమునకు ఊర్ధ్వమున ఉండెడి సత్యముతో ఐక్యము చెందవలెననీ యనుచున్నారు. అందులకే యోగమును ఆచరించవలెను యని వింటూ యున్నాము.

శ్రీమాతారవిందుల దృష్టిలో దైవమెంతటి సత్యమో దైవసృష్టి కూడ అంతటి సత్యము అని చెప్పుటకు వీలున్నది. సర్వ విశ్వమూ ఆ పరమాత్మ వ్యక్తీకరణయే .జీవితము పరిణామమునకు పొలమువంటిది, జీవితము అసమగ్రము, కష్టతరము, బాధాకరముగా నుండుటకుకారణము, మనఅంతస్తుననే యున్నది. అనగా మన జీవితము నే విధముగా నడపవలెనని మనము తెలిసికొనలేకున్నాము. సరియైన సత్య జీవితమును జీవించుటకు నేర్చిన జీవితముయొక్క పరిస్థితే మారును. సర్వమునకు మూలమైన దైవమును తెలిసిననే జీవిత విధానము మారి, సత్యజీవనము చేయుటకు వీలగును.

ప్రతి వ్యక్తియందు, దైవచేతన ప్రత్యేక వ్యక్తిత్వముతో, జీవాత్మగా ఏర్పడియున్నది. జీవాత్మ, ప్రకాశముయొక్క వృద్ధిపొందెడి జ్యోతిగా యున్నది. మానవుడు తన యందుండెడి ఈ సత్య కేంద్రమును కనుగొనుటకే యోగముననుసరించవలయును. జీవితమున దానినికనుగొని, మనయందలి వివిధ సత్తాలను దానిచుట్టు పొందుపరచుటే తదుపరి మెట్టు. అందువలన

యోగము; జీవితమున సత్య కేంద్రమును కనుగొని, తదనుసారముగా జీవితమును జీవించు విధానమును తెలుపు శాస్త్రముగా యున్నది.

శ్రీ అరవిందాశ్రమమున అనుసరించు యోగము సమగ్ర ఉద్దేశ్యములతో ఆచరింపబడుచున్నది. ప్రకృతియందలి ఏ భాగముగాని, అనగా అనృతము, నీచము మరియు సరిచేయబడనివి యని వదలిపెట్టబడలేదు. సర్వము వస్తుతః దైవమే యని వాటిని దైవ విధానమునకు మార్చుటకు చైతన్యవంతమైన ప్రయత్నము జరుపబడుచున్నది. ఇట్టి సమగ్ర దృక్పథము కలిగియుండుటచేతనే పూర్ణయోగమని ఈ యోగమునకు నామమేర్పడినది.

సాధారణముగా మానవ సత్తా భౌతికదేహమును కలిగి, ప్రాణశక్తిచే కార్యక్రమమును ఏర్పరచి, మనస్సుచే పై రెంటిని ఏలుచు, జీవాత్మ అధిపత్యముతో జీవితమును నిర్వహించుచున్నది. పూర్ణయోగము ప్రతిఒక భాగమును వృద్ధి పొందించి పరిపూర్ణతను పొందుటను నేర్పును.

పరిపూర్ణ మానవత్వమును ఏర్పరచుకొనుటకు మానవ భౌతిక దేహమును పునాదిగా ఏర్పరచుకొనవలెను. మానవ దేహము దైవోపకరణమని యెంచి కాపాడవలెను. భౌతిక దేహమును అధికాధికముగ చైతన్యవంతమొనర్చి అందుండెడి జీవాత్మను ఉత్తమ ఉపకరణముగా తయారించుట, ఈ యోగమందలి ఒక భాగము. మానసిక నిర్మలత్వముతోను, భౌతిక వ్యాయామముతోను దేహస్తబ్దతను, అవిద్యను, వ్యాధిని, తనకు తానే తొలగించుకొనుటను నేర్చును.

తదుపరి. కార్యనిర్వహణమును కోరు జీవశక్తి లేక ప్రాణపరిధియను నది యున్నది. ఇది సాధారణముగా కోరికలతోను, వాటిని తృప్తి చెందించుకొనుటతోను, అహంకార దర్పముతోను. నిమ్న ప్రాణ కోరికల తృప్తి

పరచుకొనుటతోను, ఆకట్టబడియున్నది. శ్రీ అరవిందాశ్రమమున, ఒక విధ మగు కార్యక్రమముతో, మానవ ఆకాంక్ష, పరిపూర్ణతను, ఉత్తమ ఆధ్యాత్మ విధానమగు కార్యక్రమముతో జతపరచబడియున్నది. ప్రతి ఒకరు తనశక్తి కొలది సామూహిక కార్యక్రమమును నెరవేర్చుదురు. ఈ కార్యక్రమము ధనా పేక్షలేక కార్యము నిర్వహించుచున్నారు. ప్రతివారు శ్రీ తల్లిగారి అంగీకార ముతో తనకు తగిన కార్యమును ఏర్పరచుకొని నెరవేర్చుచున్నారు. గీతలో చెప్పినటుల ప్రతి సాధకుడు దైవముపై ఏకాగ్రతచేసి తన కార్యమును చైతన్యవంతముగాను నిజాయితితోను, నెరవేర్చి వృద్ధిపొందుచున్నాడు. సాధ కుడు ఆంతర అభివృద్ధిని మాత్రమే పొందుటకాక కార్యరంగ మతనికి ఒక పరీక్షాకేంద్రమై, సమరస భావమును, ఆధ్యాత్మిక సత్య చేతనను, ప్రతి కోరని ప్రేమను, వృద్ధిపొందించు కొనుచున్నాడు.

సాధకుడు తన మనోప్రవృత్తి విషయమున మిక్కిలి శ్రద్ధ చూప వలసియుండును. మానవుని ఉత్తమ ఆకాంక్షలను గురించి శ్రీమాతారవిం దులు విపులముగా వ్రాసియుంచియున్న వాఙ్మయమును తరచిచదివి, ఆకలింపు చేసికొనవలయును. ఈ వాఙ్మయము పాక్షికము, మత సంబంధమైనదికాక, సర్వసామాన్యమై, సర్వమునకు చెందినదై యున్నది. ఆశ్రమ పుస్తక భాండా గారమున, ఆధ్యాత్మిక తత్వమునుగూర్చి, దేశ చరిత్రలనుగూర్చి, నిగూఢ విషయముల గురించి, రాజ్య తంత్రముల గురించి, భాషలను గురించి విపు లీకరించు గ్రంథములు బహుళములుగా నున్నవి. ఆశ్రమమున నడుపబడు అంతర్జాతీయ విద్యా కేంద్రమందుకూడ పైవాటిని తెలిసికొనుటకు మార్గము చూపబడుచున్నది, ఆ విద్యాకేంద్రమునందు అన్ని అంతస్తులలోను, ఎవరికి తగిన విద్య, వారు నేర్చుకొనుటకు వారి వారి అంతరవృద్ధి ననుసరించి యోగ మార్గమును తెలుపుటకు ప్రయత్నింతురు. ఉత్తమజ్ఞానమును, పరావిద్యను తెలిసి

విద్యార్థిలోని నిమ్నజ్ఞానము; ఆ పరావిద్యయొక్క సరియైనవిధానమును, దాని విలువలను ఆకలింపు చేసికొనుటకు మార్గములను చూపించుచున్నదీ విద్యా విధానము. మానవ మనస్సును సంస్కరించి, దానినది అధిగమించుటకు దారిని చూపుటనుకూడ ఈ కేంద్రము నందు నేర్చుకొనవచ్చును.

ఆత్మ సంస్కారముపై సర్వము కేంద్రీకరింపబడియున్నది. ప్రతి మానవునియందును దైవడునికి ఉన్నదను విషయము అంగీకరింపబడినదే. ఆ ఉనికి నతడు తెలిసికొనలేదంటే అతడు బాహ్యప్రవృత్తియందే వున్నాడన వచ్చును. మానవుని అంతస్తులోని దివ్యకేంద్రమునకు, బాహ్యచేతనకుమధ్య; కోరికలు, అహంకారము, అవిద్య అనునవి అడ్డతెరలుగా నుండుటచే అతడు సత్యస్థితిని తెలియకున్నాడు. ఈతెరలను తొలగించుటకు నిరతర ప్రయత్నము చేసి వాటిని తొలగించుకొని, బాహ్యప్రవృత్తుల చైతన్యమును, ఆత్మ వైపు నకు మరల్చవలయును. ఈ ప్రవృత్తి నాకాంక్షించువారికి ఆంతరిక శిక్షావిధాన ములు ఏర్పరచబడియున్నవి. ధ్యానము, ఏకాగ్రత, స్తోత్రము, ఆకాంక్ష, అవాంఛితముల విడనాడుట, దైవమునకు ఆత్మసమర్పణ మొనరించుట అను నవి ఈ యోగమున ముఖ్యమైన విధానములు. కాని ఈ నిబంధనలనే ఖచ్చి తముగా ప్రతి ఒకరు అనుసరించవలెనను నిబంధనలేదు. మానవప్రకృతి వివిధముగానున్నది. ప్రతి ప్రకృతి దానికి తగిన ఉత్తమ విధానమున వృద్ధి పొందవలసి యుండును. ప్రతివారు వారి స్తోమత ననుసరించి తనకు తగిన విధానమున ప్రయత్నమును సాగించి వృద్ధి పొందవలయును. కర్మ మార్గము కాని, జ్ఞానమార్గముకాని, అన్నిటిని ఒక విధముగా జీవితమున అనుసరించి అభివృద్ధి చెందుటకు వీలున్నది. ఇంకనూ, గురువుగారి ఉనికి, దైవకృప, యోగశక్తి అభివృద్ధికి ఆలంబననిచ్చి సాధకుని పురోగమమునకు దోహద మును కలుగచేయుచున్నవి.

అందుచే ఆశ్రమమున శ్రీమాతగారి ఆదేశానుసారము జరుపు యోగము పరిమిత ఫలము నిచ్చునదికాక పూర్ణ ఫలితముల నిచ్చునదై యున్నది. ఈ యోగము, మనస్సును, నిశ్చల నీరవతలో నుంచుటకాని, మన సత్తాను బ్రహ్మమందు ఐక్యము చేయుటకాని కాదు. అది జీవితమందు చతుర్విధ పురోగమనము; అనగా భౌతికదేహము, ప్రాణ మనో సత్తాలు. చైత్యసత్తా— ఈ నాలుగు ఒకేతూరి క్రమాభివృద్ధిని దైవచేతన ప్రకారము. సాగించి, వికాసమొందిన ఆత్మతో, సంధానమొనర్చి. నూతన ఆధ్యాత్మిక శక్తిమంతపు పరిధుల నందికొని, పరిపూర్ణ మానవత్వమును సాధించవలయును. మానవుడు బాహ్యాంతరములయందు పరిపూర్ణుడై, దైవశక్తికి కేంద్రము, మార్గముయై విశ్వచలనమునకు సార్థకమైన తోడ్పాటుతో జీవించుటకే ఈ ఆశ్రమము, ఈ యోగము కోరుచున్నది.



# తత్త్వజ్ఞానము

చింతనచేయు ప్రతి మానవుడు అతని జాగ్రుతస్థితిలో, ఈ జీవితము నకు అర్థమేమి? ఈ జీవితమునకేమైనా అర్థమున్నదా? లేదా? ఈ ప్రపంచ మెచ్చటనుండి వచ్చినది? ఎచ్చటికి పోవుచున్నది? మానవుడన ఏమిటి? అత నికింతకుముందేమైనా ఉన్నదా? మానవుని ప్రకృత స్థితికి అర్థమేమైనా కలదా? అని ఆలోచించును:

ఈ ప్రశ్నల గురించి ఇంతకుముందెందరో ఆలోచించిరి. వాటికి పలు విధములైనట్టిన్ని, విరుద్ధములైనట్టిన్ని జవాబులు చెప్పినారు. ఈ విశ్వము దైవముచే సృష్టింపబడినది. ఇందలి జీవులను, దైవమే తన ఆజ్ఞ ప్రకారము సృష్టించి న్యాయపద్ధతిని తనయందుంచుకొని పాలించుచున్నాడు. దేవుడు మంచికి సుఖమునిచ్చును, చెడును దుఃఖముతో శిక్షించును, దైవము తన ఇచ్ఛప్రకారము జరుపుచు తను కోరికొనినపుడు విశ్వమును అంతమొందిం చును అనువారు కొందరున్నారు.

దేవుడు లేడనేవారు కొందరున్నారు. మానవుడు నైతికముగా ఊహిం చునదే దైవమని కొందరందురు. సర్వము వస్తుశక్తియొక్క కార్యాచరణఫల మని కొందరందురు. ప్రకృతిఆకృతి సత్తనుండి యాంత్రికముగా వస్తువుల కార్యకరణము వలన పుట్టుచు, నసించుచు, ఉన్నవని కొందరి ఊహ. చేతన భౌతికదేహము తర్వాతది. భూత భవిష్యత్తులులేవు, వర్తమానము మాత్రమే కలదు, మానవుని జ్ఞానమే వీటన్నిటిని కల్పించును అని కొందరనుచున్నారు.

ప్రపంచము మిథ్యయని కొందరందురు, ప్రపంచ మస్థిరము, క్షణ క్షణమునకు సర్వము మార్పుచెందునది. మానవుడు ఊహాప్రవాహము మరియు

భావములమాట. సర్వము పరమేచ్ఛవలన అనంతముగా, చర్వితచర్వణముగా జరుగుచున్నది. ఎప్పుడు దీనికి ఆధారము సడలింపబడునో అప్పుడీ ప్రవాహము (నడక) నిలిచిపోవును. అందుకు నిజమైన కట్టుబాటులేదు. నిజముగా ఉన్నది శూన్యము, పూజ్యము, మరియు అభావము అని కొందరందురు.

మానవుని మనస్సుపై ఎక్కువగా పనిచేసిన భావమింకొకటియున్నది. దానిప్రకారము అత్యుత్తమ సత్యము (యదార్థము) ఒకటి యున్నది. కాని అది అనిర్వాచ్యము, అద్వయము, బ్రహ్మము— సృష్టికి అతీతమైనది. అదే సత్యము తతిమ్మది అసత్యము. ఈ విశ్వమంతయు ఆ బ్రహ్మముయొక్క నీడ, లేక మాయానిర్మితము. అందువలన ప్రపంచదృశ్యము, అందలి ప్రజ, సర్వము చలించు ప్రతిబింబములు. ఈ సత్యమును త్వరగా గ్రహించి, జీవితమును అసత్యమని తెలిసి, ఇందుండి మరలి ఏకైక పర సత్యమునకు పోవుట మంచిదనెడి వారు కొందరు.

ఇందుకు కొంత మార్పుకల భావమింకొకటియున్నది. అది జగత్తునకు జీవితమునకు సాక్షికసత్యము నిచ్చుచు, పరసత్యమును నొక్కిచెప్పినది. ఏ విధముగా తరతమభేదములు చెప్పిననూ జీవితమును అనిత్యమనిరి. పూర్తిగా అసత్యముకాకపోయిననూ పరసత్యమునకన్న లోపమైనదని తెలిసికొని, ఈ నసించెడి, సంక్షోభమునుండి విడివడి, సత్యము, నిత్యము, అయిన పరమునకే పోవలయునని కొందరి భావము.

శ్రీఅరవిందులిట్లు వచించిరి. జగత్తు భ్రాంతికాదు, ఆధారరహితమైన క్షణభంగురమైన గోచరముకాదు, సర్వము సత్యమె "సర్వం ఖల్విదం బ్రహ్మ." నీవు సత్యమె. నేను సత్యమె. దృగ్గోచరమైన దంతయు

సత్యమె. పరసత్యమెంతటి సత్యమో ఇది అంతటి సత్యము. బ్రహ్మమే సర్వమూ అయినాడు. అందుచే సర్వమూ సత్యమే అని తెల్పిరి.

"బ్రహ్మమా! మీరు పురుషుడు, స్త్రీ, బాలుడు మరియు బాలిక; వృద్ధులు, మరియు అశక్తిపరులు, మీరు కర్రతో వంగి నడచువారు; మీరు నీలిమ పక్షి, ఆకుపచ్చ, మరియు సింధూరవర్ణ నేత్రము కలవారు."

(4-3-5- శ్వేతాశ్వేతరోపనిషత్)

-: 2 :-

పూర్వ వేదాంతఋషులు సత్యమును కని బోధించినదిట్లున్నది. పరమ సత్యమొకటి కలదు. అది ఏకము, అనంతము, అనిర్దేశ్యము. ఇదే బ్రహ్మము, ఏకైక సత్యము, కేవలము మరియు సర్వము. సర్వము బ్రహ్మమునందేయున్నది. బ్రహ్మమువినా ఏమిన్నీలేదు. ఈ జగత్తంతయు బ్రహ్మముచే, బ్రహ్మమునందు ఏర్పడినది. అందుచే బ్రహ్మమెంత సత్యమో జగత్తూ అంత సత్యము.

పరమ సత్యము అగ్రాహ్యము, వాచామగోచరమైనదికూడా— ఒక అనిర్దేశ్యమైన మహనీయత. నిజమునకు సర్వమూ అయిన బ్రహ్మము సృష్టికి పూనుకొనినపుడు ఈ సత్ పదార్థము 'సత్'గా తన్ను తాను ఏర్ప అచుకొనును. ఈ సత్పదార్థము తన్ను తాను తెలిసికొనునదికూడ, మరియు శక్తివంతమైన ఆత్మజ్ఞానము కలిగియున్నది. దానినే 'చిత్' శక్తి అందుము. 'సత్' 'చిత్'ల కలయికే పరిపూర్ణ ఆనందము. దీనిని 'ఆనంద' మందుము. ఇదే త్రిపుటి "సచ్చిదానందము". ఇందు సత్యము తనను తాను తెలిసికొని దాని సమష్టితిని సృష్టికి కారణమగును.

బ్రహ్మము ఎందులకు సృష్టించుకొనవలెను? పరిపూర్ణత (బ్రహ్మము) తన అనిర్దేశ్యమైన నిర్వికారతనుండి చలనమువైపుకు ఎందుకు పోవలయును? తనలో లేనిదానిని దేనినైన కోరుచున్నదా? బ్రహ్మము కోరికతోకాదు తనను వ్యక్తీకరించుకొనునది. తన ఆనంద ప్రవాహమున తనను తాను బయలు పఱచుకొని, తెలుపుకొనుచున్నాడు. ఇట్టి బ్రహ్మానందము వలననే అనంత చలనము, వైవిధ్యము ఏర్పడుచున్నది. ఆనందమే దాని మూలము, ఆనందమే దాని గమనము, ఆనందమే దాని గమ్యముకూడ. సర్వసృష్టి బ్రహ్మము యొక్క ఆవిర్భవము, ఆనందముయొక్క ప్రవాహము. వేదముకూడ ఇట్లే చెప్పుచున్నది, "సర్వంఖలు ఇదం బ్రహ్మ".

కాబట్టి ఈ విశ్వము బ్రహ్మముయొక్క వ్యక్తీకరణము, సత్యము కూడా. బ్రహ్మముయొక్క వ్యక్తీకరణము అనగా, బ్రహ్మము తనయందుండెడి దానినే సర్వముగా తెల్పుచున్నాడు. బ్రహ్మముయొక్క స్థితి, సత్. చిత్ శక్తి, మరియు ఆనందము — వేరుగా చెప్పవలెనన్న బ్రహ్మము అయిన కేవలసత్త సంభూతిగా ఏర్పడి, తన పరిపూర్ణతలో ఆత్మ సత్యమును, ఆత్మ జ్ఞానమును, ఆత్మశక్తిని, ఆత్మానందమును అనేకములుగా తెల్పుచున్నాడు.

సృష్టి ఉద్దేశ్యమిదియే యని శ్రీ అరవిందులు చెప్పియున్నారు. సృష్టికర్త తన అనంత ఆనందమును, అనంత చేతనాశక్తిని, అనంత సత్యమును విశ్వములో పరిపూర్ణముగా ఆవిష్కరించియున్నాడు. సృష్టియందు ప్రతిదానిని ఈ ఉద్దేశ్యమే గుప్తముగా పాలించుచున్నది. కాని దానిని తెలిసికొని సృష్టికర్తయొక్క ఉద్దేశ్యమును నెరవేర్చుటే మానవుని కార్యముగా ఉన్నది.



సచ్చిదానందముయొక్క అస్తిత్వము ఈ భౌతికమునకు నేరుగారాదు. దాని వ్యక్తీకరణము అంచెలవారిగా యుండును. సృజనాత్మక బ్రహ్మము

యొక్క అవతరణ కొన్నికక్ష్యలద్వారా సంభూతిచెందును. ప్రతికక్ష్యయొక్క అంచయందు బ్రహ్మముయొక్క సూక్ష్మత తగ్గుతూ ముందు కక్ష్యకంటే రాబోవుకక్ష్య ఘనతయందు వృద్ధిచెందుచూ భౌతికఅస్తిత్వమునకు చేరుచున్నది. ఈ కక్ష్యలనే "సప్తకక్ష్యలు," "సప్తపదములు," 'సప్తధామములు'' అని వేదము పేర్కొనియున్నది. అనగా సత్, చిత్, ఆనంద కక్ష్యలు మూడు; విజ్ఞానకక్ష్య ఒకటి; దీనినే సత్యచేతనా కక్ష్యయనికూడ అందురు. పదివేల సూర్యుల వెలుగుతో సమానమైన వెలుగుండెడిదీ కక్ష్య. తర్వాత కక్ష్యలు. మనోమయ, ప్రాణమయ, అన్నమయకక్షలు మూడు. వెరశి అన్నియు ఏడు కక్ష్యలు:- అన్నమయ కక్ష్యను లేక భౌతిక భూమిని విశ్వమయ పురుషుని పాదములుగా వర్ణింతురు ''పాదాభ్యాం పృథ్వీ''.

అవతరించెడి బ్రహ్మము ఈ సప్తకక్ష్యలయందు, ఆ కక్ష్యయొక్క మూలకారణము ప్రకారము నిర్మాణముచేసికొనును. అందుచే ఈ సప్తకక్ష్యలు, దైవోద్దేశముకొఱకు, వాటి మూలకారణముయొక్క, చైతన్యవంతము, మరియు శక్తిమంతము, అయిన కార్యముగా యున్నది.

ఈ అవతరించు చైతన్యము అనగా బ్రహ్మము; ప్రతి కక్ష్యయందును ప్రత్యేక సూత్రప్రాయముగా తన ప్రత్యేక మూలకారణమును ఏర్పాటుచేసికొని విస్తరించియున్నది. అందుచే దైవకార్యముకొఱకు ప్రతి అంచయందు దాని మూలకారణ చైతన్యము, కార్యక్రమమున శక్తిమంతముగా పనిచేయుచున్నది. ఈ విధముగ దైవము తన జ్ఞానమును శక్తిని అనంతత్వమును, వివిధ కక్ష్యలయందు వ్యవస్థానుగుణ్యముగ సత్, చిత్, ఆనంద కక్ష్యలలోను, సత్యచేతన లేక విజ్ఞాన కక్ష్యలోను, మరియు మనోమయ ప్రాణమయ కక్ష్యలలోను ఏర్పడి పనిచేయుచున్నాడు.

భూమిపైన అనగా భౌతిక కక్ష్యయందుకూడ సృజనాత్మక సత్యము తనను వ్యవస్థీకరించుకొని యున్నది. ఇచటి ప్రతి విషయము, ప్రతి వ్యవస్థ, పరమ సత్యమునకు వ్యతిరేకముగా నుండునట్లు కనబడుట నిజమే. సత్యము తన నిజస్థితినుండి అవరోహించి భౌతికస్థితికి వచ్చుసరికి తానులేనట్లుగా కన బడునట్లు చేసికొన్నది. ఈ సత్యము చాలా సూక్ష్మతర త్రసరేణువుగను, వై విద్యమైన అచేతనతో కలిసి, అవిద్యతో సృష్ట్యాదినుండికూడ యున్నది. ఇట్టి సత్యముకూడ ప్రయత్నపూర్వకముగా యున్నది. అత్యుత్తమ సత్తాకు వ్యతిరేకముగానుండు స్థితియందుకూడ దైవము తనసత్తాను దాని పరిపూర్ణ వికాసవంతముతో తెలియ పఱచుచున్నాడు.

ఈ కార్యమును తెలియచేయు విధానమును శ్రీఅరవిందులు ఆధ్యాత్మిక పరిణామమని నుడివిరి. సృష్టియందుదాగి యుండెడి చేతన లేక దైవత్వ మును, క్రమ క్రమముగా వికసింపజేయుటగా యున్నది. పృథ్వియందవరో హించిన చేతన ఘనీభవించి మరల అందుండి విడివడుటకు ప్రయత్నముతో క్రమ క్రమముగా ఊర్ధ్వగమనమున (ఆరోహణమున) తగు ఉపాధులతో, తనను తాను తెల్పుచున్నది. ఎట్లన:— ఈ ఘనీభవించిన పృథ్వినుండి ప్రథమ మున చేతన జీవ స్పందనముగా ఏర్పడి, తర్వాత క్రమ క్రమముగా క్రిమి కీట కాదులుగాను, అంతకంటె మేలుజాతి జీవములుగాను ఏర్పడినవి. వీటి యందు చేతన క్రమముగా అభివృద్ధిచెందుచూయున్నది. జీవన చేతనాభివృద్ధికి ఊర్ధ్వమున నుండెడి జీవన కక్ష్య ముఖ్యకారణముగా యున్నది. పృథ్విపై జీవన తత్వము ఏర్పడిన తర్వాత అంతకన్నను చైతన్యవంతమైన ఆత్మజ్ఞాన మును తెలియపఱచు మనోతత్వము ఏర్పడినది. జీవితమేవిధముగా జీవన కక్ష్యనుండి ఏర్పడినదో అదేవిధముగ మనస్సు. మనోమయ కక్ష్యనుండి యేర్పడినది.

మనోమయతత్వము ఏర్పడిన తర్వాత, ప్రకృతము ఇది ఒక ముఖ్య మలుపుగాయున్నది. ఏమన ఇంతవరకు పరిణామము ప్రకృతిచే యాంత్రికముగా జరుపబడినది. ఇంతవరకు పరిణతిజెందెడి జంతువుగాని, వృక్షముగాని చైతన్యవంతముగా పరిణామమునకు సహకరించలేదు. ఈ మలుపు తర్వాత ప్రకృతి మనస్సుకు ఒక భాగస్వామే. దీనికి ఆత్మజ్ఞానము కలదు, మానవునియందు పరిణామముచెందుసత్తా, తననుతాను తెలిసికొనియున్నది. తన శక్తి కూడ దానికితెలియును. మరియు తన విస్తృతిని, తన్ను తాను అధిగమించుటకు అవస్యకతనుకూడ తెలిసియున్నది. ఇట్లు వృద్ధిచెంది స్థిరపడిన జ్ఞానమునకు కూడ పరిమితియున్నది. ఇదే కడపటిమెట్టుకాదు. ఉత్తమ చేతనను పరిపూర్ణముగాతెల్పు ఉపకరణము కూడ కాదు.

ప్రకృత మేర్పడిన మనస్సు, మార్గమందు ఒకమెట్టు మాత్రమె. ప్రపంచమందలి గజిబిజులచే, సత్య పరిపాలనకు తగినట్లుగా లేకుండుటచే మనస్సు సచ్చిదానందమును భూమిపైకి అవతరింపచేయుటకు తగిన శక్తిమంతమైన శక్తి ప్రకృత మనస్సునకు లేకున్నది. ఈ సచ్చిదానంద లక్షణములను భూమిపై అవతరింపచేయుటకు తగిన శక్తి వేరేయున్నదని శ్రీ అరవిందులు వెల్లడించిరి. అత్యుత్తమముగా పరిణతి చెందిన మనస్సుకంటె ఉత్తమమైన శక్తి ఈ సృష్టికి ఊర్ధ్వమున నున్నది. అదే "అతీతమానసము" ఈ యతీతమానసమే సచ్చిదానందమును భూమిపైకి అవతరింప చేయునది. ఈ ఆతీతమానసము మూలసత్యచేతన. సర్వశక్తులకు సర్వాకృతులకు, సత్యమును తనయందు కలిగియున్నది. ఇదే ఉపనిషత్తులలో చెప్పబడిన విజ్ఞానము. అది ఆత్మజ్ఞానము కలిగిన, మూలతత్వముకలది, స్వశక్తిమంతమైనదికూడ. అంతస్థున, ఊర్ధ్వమున ఉండెడి శక్తిని మేల్కొలిపి, ఆకాంక్షించెడి పృధ్విచేతనలో దానిని స్థాపించి ప్రకృత మానవ పరిణామమును కొంతవరకు చైతన్యవంతముగాను, అర్థచైతన్యవంతముగాను ప్రకృతమున

నడిపించుచున్నది:

ఉత్తమశక్తి సృజనాత్మక సత్యము, లేక అతీతమానసచేతన, అవత రించి అనుభవించి పరిణామమును ముందుకు నడిపినపుడే. ప్రపంచమందలి అర్ధవెలుగు అర్ధజ్ఞానము మారి మరుగున నుండెడి పరిపూర్ణ దైవమును తెలియనగును.

ఇట్టిపరిపూర్ణ దైవత్వమును తెలియచేయుటే మానవునివిధి. ప్రకృతి యందు మిక్కిలి పరిణామము చెందిన వస్తువులలో మానవుడు అగ్రగామి గాన, ఈ కార్యమునుచేపట్టి, చైతన్యవంతమైన మార్గమును చూపెట్టుచూ నిర్దిష్ట గమ్యమును చేరుటకు సాయపడుచూ, మార్గమును విశదీకరించవలెను.

ఇదే శ్రీఅరవింద యోగముయొక్క ఉద్దేశ్యము, మరియు గమ్యము.



# యోగము

మానవుడు తనను తాను పూర్తిగ తెలిసికొనక, కొంత మాత్రమే తనను తెలిసికొనియున్నాడు. యోచించి కార్యమొనర్చు మనస్సును, ప్రేరేపించి అనుభవించెడి ప్రాణికశక్తిని, మనస్సునకు ప్రాణికశక్తికి అవకాశము కలుగజేయు భౌతిక శరీరమును మాత్రమే మానవుడు తెలిసికొనియున్నాడు. కాని ఇదంతయు కొంత మాత్రమె. నిజమునకు, బాహ్యసత్తకు విశాలమైన అంతస్సత్తకు, ఇది బాహ్యాకారము మాత్రమే.

పరిమిత జ్ఞానమునకు, పరిమిత కార్యాచరణకు అవకాశమిచ్చు సాధారణ మనస్సునకు వెనుక, విశాలమైన శక్తికి, విశాలమైన గమ్యమునకు అవకాశమిచ్చు ఆంతరిక మనస్సు ఇంకొకటి కలదు. పరిమిత బాహ్య ప్రాణతత్వమునకు వెనుక ఉత్తమ శక్తిమంతము, స్వతంత్రము అయిన ఆంతరిక ప్రాణసత్త ఇంకొకటి యున్నది. పరిమితము, సుస్పష్టము అయిన భౌతిక దేహమునకుకూడ, వెనుక విస్తృత వ్యాప్తికల సూక్ష్మ భౌతికదేహము కలదు. ఈ ఆంతరిక మనస్సు, ఆంతరిక ప్రాణము, ఆంతరిక భౌతికములు మూటికి, మనోమయ, ప్రాణమయ, అన్నమయ పురుషులని ఉపనిషత్తులలో చెప్పబడినది. ఈ మూడు కలసి మానవుని అంతరసత్తాగా యున్నవి, వీటి అన్నిటి వెనుక జీవిత పరిణామమునకు ఆధారమిచ్చునట్టిదైన ఇంకొక సత్త "ఆత్మ" యున్నది. దీనిని అంతరాత్మయనికూడ అందురు. ఇది దైవముయొక్క జీవకణము. ఈ నిగూఢ సత్త లేక దైవతత్వమును ఆధారము చేసికొని మానవుని జీవితము ఏర్పడియున్నది. దీనినే శ్రీ అరవిందులు 'చైత్యసత్త' లేక 'చైత్యపురుష' (శుద్ధ చేతనాత్మ) అని తెలిపిరి. ఈ చైత్యపురుషుడు మానవుని హృదయగుహ్యమందు ఉన్నాడు. "హృదయే గుహాయాం" భౌతిక హృదయమందుకాక కేంద్రమునకు వెనుకనున్నదీ చైతన్యసత్త.

భౌతికసత్తకన్న అంతస్సత్తశ్శక్తి సాధ్యతలు ఉత్తమములు మరియు విశాలమైనవికూడ. అంతశ్శక్తి సాధ్యతలు ఎంతవరకు మానవుడు బాహ్యాగత మొనర్చగలడో, అంతటి ఉపయుక్తమైనవాడుగా అతనుండును. మానవునికి జ్ఞానము, శక్తి, సౌందర్యము, ఆనందము అంతస్సత్తనుండే వచ్చుచున్నవి. కాని వీటిని మానవుని బాహ్య యాంత్రికసత్త పరిమితపరచుచున్నది, లేక వికృతపరచుచున్నదికూడ. యోగాభ్యాసముచేతను, మరియు మానిసిక ప్రయత్న అభ్యాసములచేతను, మానవుడు అభివృద్ధి చెంది, అంతస్సత్తయొక్క శ్రేణులను, దాని సాధ్యతలను వ్యపస్థీకరించవచ్చునని శ్రీ అరవిందులు వచించిరి.

:- 2 :-

మానవుడు తన సత్తాను బాహ్యముగా మరచినందున అతడు తన్నుతాను తెలిసికొన లేకున్నాడు. అట్లు తెలిసికొనుట కాతడు చైతన్య వంతుడు కావలయును. బాహ్యముగా చూచుటను మానవలయును. తన దృక్పథమును అంతస్తునకు మరల్చవలయును. ఆతడు తన చేతనాశక్తినంతటిని కూడకట్టుకొని తనలో కేంద్రీకరించు కొనవలయును. ఈ కేంద్రీకరణమును హృదయము వైపుకు మరల్చవలయును. అప్పుడు బాహ్యమునకు ప్రసరించు మానవశక్తులు వాటి అలవాట్లను మాని, వాటి నిజస్థానమగు అంతశ్చేతన వైపుకు అవి ప్రవహించును. మానవుని మనోమయ, ప్రాణమయ, అన్నమయ సత్తల స్థితి తెలిసిగాని, తెలియకగాని ఆధారమిచ్చు చైత్యపురుషుని లేక హృదయ గుహ్యమందుండెడి ఆత్మపైన ఆధారపడియున్నది. చైత్యపురుషావిష్కరణకు మానవుడు విడువని పట్టుదల ఆకాంక్షలతో ఉండవలయును. అంతట దైవము మానవునియందు వ్యక్తీకరించుటకు వీలున్నది. తర్వాత నిరత అర్పణా ఉన్మీలనముల వలన అంతస్థునందుండెడి దైవబలముచే మాన

వుని సత్త రూపాంతరమొందును. వ్యక్తి పరిణామమందు చైత్యసత్త దైవముయొక్క ప్రతినిధి. చైత్యసత్త పరిపూర్ణముగ సిద్ధినొందిన దానికి దైవతాదాత్మ్య మేర్పడి, దైవ వ్యక్తీకరణకు కావలసిన ఆత్మగా తయారగును. ఇట్టి అంతరకేంద్రమును చేరుట, దివ్యశక్తి అవతరణకు, తన సత్తాయందలి సర్వభాగములు క్రమపడుట, ఇంకనూ దాని పరిపూర్ణతయొక్క శక్తి, సౌందర్యము, సమత, ఆనందములు; శ్రీ అరవింద యోగమునకు ఖచ్చితమైన మొదటిమెట్టు. అంతర దైవమును సాక్షాత్కరించుకొనుట- చైత్యపురుషుడు ముందుకు వచ్చుట— మొదటిమెట్టు;—

అంతరమున దైవముతో తాదాత్మ్యమొందుట చాలదు, బాహ్యమందు కూడ దైవముతో తాదాత్మ్యమొందుట కావలసియున్నది. ఏలన వ్యక్తియందవతరించిన దైవము విశ్వమందుకూడ అవతరించి యున్నాడు. విశ్వమందు దైవము విస్తృతుడై యున్నాడు. "ఏకంవా ఇదం విబభూవ సర్వం" ''ఒకటి సర్వమూ అయి ఉన్నది'' బాహ్య సత్యము తెలియనిదే అంతస్సత్యము మాత్రమే పరిపూర్ణముకాదు. అవిద్యయనెడి తెర మనలను వేరుచేయుచూ ఇతరులను తెలిసికొన లేకుండ చేయుచున్నది. ఈ తెరను వైతొలగించి తన య ం ద లి దైవతాదాత్మ్యముతోను సర్వమునందుండెడి దైవముతోను తాదాత్మ్యము చెందవలయును.

మానవుడు తనచేతనను విశాలపఱచి, విశ్వమును ఆలింగనము చేయుటకు యత్నించి కృతార్థుడు కావలయును. ఈ విస్తృతి మానవుని సత్తాయందేభాగమునుండి యైనను మొదలు పెట్టవచ్చును. మనస్సును విశాలమొనర్చవచ్చును. లేదా వికాసమొందిన చైతన్య కేంద్రమగు హృదయమునుండి కరుణ, ప్రేమ, సమతలనువెల్లడించి విస్తృతపరుపవచ్చును. ఇట్టి ఆత్మవిస్తృతి కార్యము, స్థిరతను, శక్తిని ఇచ్చి, బాహ్యప్రకృతి బంధములనుండి చేతనను

విడదీయును. తదుపరి చేతన విశాలమై అంతస్సత్తాయందు జాగ్రదావస్థ యందుంటూ, దాని సహజ స్థితియగు విశాలతనుచెంది; వ్యక్తిగత చేతన, విశ్వచేతనను ఆలింగన మొనర్చును. అప్పుడే వ్యక్తి సమిష్టితో నిజమైన ఐక్యతను పొంది సమిష్టియొక్క మూలమును తెలిసికొనును. తనుగా యుండెడి దైవము విశ్వముగాయుండెడి దైవము ఒకటేయని గుర్తించును. నేనే సర్వము "అహమేవ ఇదం సర్వం" (ఛాందోగ్యోపనిషత్) అని తెలిసి కొనును. ఇది రెండవమెట్టు. "విశ్వమయ దైవముతో తాదాత్మ్యమొందుట."

తర్వాత వ్యక్తియందుండెడి దైవము విశ్వమందుండెడి దైవము అను ఈ రెండు, అతీతమైన ఒకే దైవత్వముయొక్క వ్యక్తీకరణములని తెలిసి కొనవలయును. "ఏకోదేవం సర్వ భూతేషుగూఢః. సర్వవ్యాపి సర్వభూతాంతరాత్మా- సర్వ భూతాధివాసం- కేవలో నిర్గుణశ్చ" (శ్వేతాశ్వేతరోపనిషత్) ఇట్టి ఉత్తమ దైవమే (సత్యమే) వ్యక్తిత్వమై వ్యక్తియందు దైవాత్మగా ఏర్పడి, ఆతని ఉనికికి సాయపడును. ఆ యతీత దైవమే అనంత ఉనికికి ఆధారమై, విశ్వమునకు దివ్యాత్మగా యున్నది. అందువలన వ్యక్త్యాత్మ విశ్వాత్మ, వాటిమూలము ఒకటే. శ్రీఅరవిందయోగము మూర్తీభవించిన సర్వ దైవతత్త్వమును ఆలింగనము చేసికొనియున్నది. మరియు ఈ యోగోద్దేశము అతీత దైవమును, దాని వివిధ, శక్తి, జ్ఞాన, ఆనంద, ప్రశాంతతలతో ఐక్యముచెందుటే.

ఇందుకు మార్గము మానవుని ప్రకృతి అన్నమయ, ప్రాణమయ, మనోమయముల యొక్క చైతన్య పరిధులను దాటి ముకుళించుకొనియున్న సత్తా ఊర్ధ్వ అంతస్తులను వికసింప చేయవలయును. ఆలోచనచేయు మనస్సునకూర్ధ్వమున అనేక స్థరములున్నవి. ప్రతి స్థరము దాని స్వాభావికమైన శక్తులుకలిగియున్నది. ఇట్లున్న స్థరములను మేల్కొలిపి చేతన ఉత్తమస్థితిని

పొందుటను నేర్వవలెను. మరియు ఆయాస్థితుల శక్తుల కార్యకరణములను ఆయా చేతనయందు వాడుక చేసికొనవలెను. అనగా వ్యక్తీకరించు ఉత్తమ దైవత్వము; జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ఆనంద శక్తుల, 'సంధానము' ఈ ఉత్తమ స్థరముల దాపున ఉన్నది. సత్తాలోని చైతన్యవంతమైన భాగములను ఉత్తమ స్థితికి చెందించి, మనపై ప్రసరించు ఆధ్యాత్మశక్తి తేజప్రభావములచే స్థిరీకరించ వలయును.

ఇచ్ఛ, ఆకాంక్ష, ఏకాగ్రతల క్రమశిక్షణచే, మనచేతనను ఊర్ధ్వ ఆధ్యాత్మికమునకు గొంపోవుచు, మరియు ఊర్ధ్వ చేతనను దాని శక్తులను మన వైపునకు ప్రసరించునట్లు చేయుచూ, మన సత్తాయందవి నిలుచునట్లు చేయవలెను. ఇందుకొరకు మనము శిరస్సున ఏకాగ్రత, ధ్యానముచేయవచ్చును; లేక సర్వసత్తాలు గ్రహించునట్లు ఏకాగ్రతతో ధ్యానించవచ్చును; లేదా హృద్గుహ్యమునకుచేరి అందుండి, ఊర్ధ్వశక్తిని ప్రార్థించి, అది తనంతటతాను వ్యక్తమగుటకు మనము ప్రయత్నించ వలయును. ఏవిధముననైనను మన లక్ష్యము దివ్య ఆధ్యాత్మికశక్తి వ్యక్తీకరణకు మనము ఉన్ముఖులమైన, అధికాధికముగ మనము వృద్ధిచెంది దైవప్రకృతికి మారగలము. ప్రతి ఉత్తమ దైవచేతనను తెలిసినపుడు, మన ఏ సత్తా దాని కౌగిలికి అర్పించుకొనునో, దానియందు దైవచేతన తన గుణములను చొప్పించును. ఇదే వృద్ధిపొందు విధానము. అనగా మనచేతనయొక్క ఊర్ధ్వాభివృద్ధి, మరియు దైవచేతన యొక్క అధోగమనముల కలయికచే పరిపూర్ణస్థితి ఏర్పడును. కడపటి సిద్ధియగు మానవుడు దైవముగా మారుటకు ఇదే దారి. కాని మానవ ప్రకృతి నుండి దివ్య ప్రకృతికి పూర్తిమార్పు కడపటి పరిపూర్ణస్థితి. అనగా మానవుడు దివ్య మానవుడు అగుట. పరిపూర్ణమైన ఈ మార్పు, స్వతస్సిద్ధమైన దైవశక్తి, లేక అత్యుత్తమమైన పరాచేతన లేక వ్యక్తీకరణమునకు ఊర్ధ్వమున నున్న శక్తిమంతమైన ఇచ్ఛాజ్ఞానము వలన సిద్ధించును. దీనినే శ్రీఅరవిం

దులు అతీతమానస మనిరి. మూడవది: ఈ యోగమునకు ఉత్తమస్థితి ఆయినట్టిన్ని, అతీతమానస చేతన అని పిలువబడు ఈ ఉచ్చసిద్ధి శ్రీఅరవిందయోగమున ఆధ్యాత్మిక క్రమవృద్ధివలననే ఏర్పడును.

ఈ మూడు స్థితులు వరుసగా రానవసరము లేదు. మానవాత్మ కేది సాధారణముగా అభిరుచి కలదో ఆ సిద్ధి ముందు వచ్చును. తర్వాతవి అనుసరించును. సాధారణముగా అవి ఒకేతూరి ఒకదానికొకటి సాయపడుచూ వచ్చును. ఒక సిద్ధి నిలిచినదా యని అనిపించుచూ మరొకటి వృద్ధిపొందును. కడపటి కన్నియూ ఒకటై పరిపూర్ణ సిద్ధినిచ్చును;—

## ః 3 ః

ఇంతవరకు అవగాహనకాని అనేక మార్గములు కలట్టిన్ని, ఎక్కువ అవకాశముకల ఈ యోగమును, సక్రమముగా సాధించుటకు తగిన మార్గదర్శి కావలసియుండును. అందుచే మార్గదర్శకత్వమునకు, తగిన సలహా ఇచ్చుటకు గురువు తప్పనిసరిగా కావలయును. ఆత్మానుభవము కలిగినట్టిన్ని సత్యముతో నిండిన శక్తి కలట్టిన్ని, తన అనుభవములను ఇతరులకు తెలియచేయు శక్తికల గురువు బోధకుడుగా యుండవలయును. మౌనమునందు గాని, మాటలచేగాని గురూపదేశముచే ఆతని ఆధ్యాత్మికశక్తిని శిష్యునికి ప్రసాదించును. శిష్యుని మనస్సును ఉపకరణముగా చేసుకొని గురుశక్తి సాధనను చేయును. ఇదే దైవశక్తి - గురుశక్తి, నిజమైన శక్తికలది. సత్తా యొక్క సత్యచేతనాశక్తి శిష్యునియందు వ్యవస్థీకరించబడినది. ఈ కష్టతర ప్రయత్నమందు యోగమార్గగామికి త్రోవచూపునది, మరియు బలమునిచ్చునది వ్యక్తిగత ప్రయత్న మనవసరమని చెప్పుటలేదు. తీవ్ర ఆకాంక్ష కావలయును. అతని కేంద్రసత్తా మాత్రమేకాక సర్వసత్తాలు యోగముపైపుకు

మరలవలయును, మరియు ఆకాంక్షాజ్యోతి వెలగవలయును. ఇట్టి తృష్ణ ప్రదీప్తము కావలసియుండును.

ఈ ఆదర్శేచ్ఛను సడలకుండుటకు, నీ ఆకాంక్షను -బలహీన పరచకుండుటకు, నిరతత్యాగము కావలయును. విషయముల త్యజించుటకాని, కోరుటకాని, నైతికము లేక మత కారణములవల్లకాక, వాటి లక్షణములను బట్టి యుండును. అంతర జీవితమును వృద్ధిచేయువానినే కోరవలయును. మరియు అంతర జీవితాభివృద్ధిని నిరోధించువాటిని త్యజించవలెను. కాని ఎల్లప్పుడు విషయముల త్యజించుట మీదనే నీ కాలమును వెళ్ళబుచ్చకుము. పవిత్రత, ప్రశాంతత, జ్ఞానము వృద్ధిపొందుటకు ప్రయత్నించిన, అవి ఆకాంక్షపరుని సత్తాయందు నిలిచి-వాటి వ్యతిరేక గుణములను పారద్రోలును.

ఉత్తమ చేతన మనయందు బాగుగా పనిచేయుటకు, సాధనకు తగినట్లుగా మనలను తయారుచేయుటకు, మన సత్తా దైవసత్తాకు అర్పించుకొనునట్లు మనము నేర్వవలయును. మనయందు ఎదురుతిరిగిన ఇంద్రియములు ఉత్తమచేతనకు అర్పించుకొన్న ఇంద్రియములను అనుసరించునట్లు క్రమశిక్షణ చేయవలయును. అంతస్థునందుండెడి మార్గదర్శియొక్క లేక గురువుయొక్క వాక్కును వినుటకు మన హృదయమనస్సులను పరిలించవలయును. ఈ యోగమునందు, అర్పణబాధ్యత స్వప్రయత్నేచ్ఛల విముఖత కాదు. వాటి వాటి ఉత్తమశక్తికి వానిని వృద్ధిపొందించి అవి ఆత్మ పరిపూర్ణేచ్ఛయందును, దైవశక్తియందును ఐక్యమగునట్లు చేయుటే.

అంతఃప్రయత్నము మాత్రమే చాలదు. బాహ్యసత్తాయొక్క ప్రయత్నముకూడ కావలయును. ఈ యోగము మనలను ఉత్తమస్థితికి తీసికొనిపోవుటేకాక మానవసత్తా మార్పునుకూడ చేయును. ఆత్మవిమోచనమేకాక మానవసత్తాయొక్క సర్వభాగములు స్వాధీనమై, పవిత్రతచెంది, యోగము

నందు వాటి వాటి కార్యములను సక్రమముగా జరిపి సాయపడవలసి యుండును. ఇవన్నియు ఆత్మసాక్షాత్కారము వైపునకు వృద్ధిచెందుటకు పనిచేయును. ఆలోచించు మనస్సు తగు విధముగా తయారై, విస్తృతిచెంది జ్ఞానమార్గము వైపునకు మనలను తీసికొనిపోవుటకు సాయపడవలయును. భావసంబంధమైన భాగములు, ముఖ్యముగా హృదయము, ఉత్తమ ప్రేమారాధకుని వైపుకు ప్రేమమార్గమున బహువిధ భావముల వికసింపచేయుటకు తగిన కేంద్రముగా తయారుకావలయును. శక్తిమంతమైన జీవితసత్త, దైవేచ్ఛతో జతపడి, స్వాభిమానమైన కోర్కెలు విడనాడి, కర్మమార్గమునకు వినియోగపడవలయును. దేహముకూడ క్రమశిక్షణను పొంది, పవిత్రత చెంది, దైవముయొక్క నడియాడెడు దేవాలయముగా తయారుకావలెను.

పూర్ణయోగాభిలాషి దైవకృపపై నమ్మకముంచుకొని ఉత్తమ గమ్యమును చేరుటకిట్టి పరిశ్రమ చేయవలసియుండును. ఈ పరిశ్రమ ద్విముఖము కలది. మొదట, అనగా కొంతకాలము వ్యక్తిగత ప్రయత్నమే ముఖ్యము. ఈ ప్రయత్నమువలన దైవకరుణ పనిచేయును. అర్పణ చేయుటను తెలిసికొనిన కొలది, దైవము తన చేతులలో మనలను ఉంచుకొనినకొలది, దైవకృపవలన, కార్యక్రమమునందుండెడి దైవశక్తి నేరుగా సాధకుని సాధనను జరిపించును. తప్పనిసరిగా ఇట్టిది జరుగవలయును. ఏలన ఈ యోగముయొక్క ముఖ్యోద్దేశము, ఆత్మ పరిత్యాగము లేక నిర్వాణము కాదు. నిర్వాణమును ఒక దృఢ నిశ్చయముతో పొందవచ్చును. గురు కటాక్షముచేతను తపస్సుచేతను పొందగలుగు ఆత్మానుభవముకూడ కాదీ యోగోద్దేశము. మానవుని సర్వసత్తా ఆధ్యాత్మిక ఉత్తమస్థితికి తీసికొనిపోబడి, పునస్సృష్టి చేయుటే ఈ యోగోద్దేశము. పరిపూర్ణ దైవసత్యము ప్రకారము మానవుని స్వభావము మారవలయును. ఎట్టి కఠినతర మానవ ప్రయత్నముచేతను కాక ఒక జ్ఞానేచ్ఛయొక్క మూలశక్తి, సత్యజ్ఞానమును పాలించు చేతనాశక్తి, అత్యుత్తమ శక్తియుయగు దివ్యమాత చేతనే ఈ మార్పు కావలసియున్నది.

# దివ్యమాత

అత్యుత్తమ సత్యము ఏకము అనిర్వాచ్యము. కాని వ్యక్తీకరణ విధానమున చూచిన అది తనను సత్తాగను, ఉత్తమచేతనగల అస్తిత్వముగను తెలిసికొనుచున్నది. చేతన స్వతస్సిద్ధము, నిజమునకది సత్తాయొక్క స్వభావము. అది తనను తాను తెలిసికొనినది మాత్రమేకాదు. అది చైతన్యమై ఒకేతూరి తనను తాను, మరియు సర్వమును తెలిసినదై యున్నది. దాని సహజ గుణము శక్తివంతముగా నుండుటే మరియు దైవసత్తాయొక్క శక్తిగా యున్నది. బ్రహ్మమునుండి సత్తా బహుళత అనేక ఆకృతులుగను పలుపేర్లతోను, అనంత గంభీరతనుండి పరిమిత వస్తుసమూహములుగను, ఏకత్వము నుండి బహుళములుగను ఏర్పడినది, ఇదే మాయ. ఆమె శక్తి ఏకైక చేతనా సత్తయగు పురుషునినుండి, బహుళమైన ఉద్దేశ్యములుకల సృష్టికి (స్వేతాశ్వేతరోపనిషత్) ఆమె ప్రభువగు పరమేశ్వరుని సత్తాయందు ఉండు దానిని వ్యక్తీకరించడమే కాక, సృష్టిలోనికి తెచ్చినవానిని, పాలించుచూ, ముందుకు నడుపుచూ, త్రోవ చూపుచున్నదికూడ, ఈశ్వరికూడ ఆమెయే.

దైవసత్తా మరియు చేతనాశక్తి, లేక పురుషుడు మరియు శక్తి, వేరు కాదు. వాస్తవమునకు చేతనాశక్తియే సత్తాకూడ. దైవము వ్యక్తీకరింపబడినపుడు అవి దైవసత్యముయొక్క ద్వివిధ అవస్థలు. పురుషశక్తులు అన్యోన్య సంబంధము కలవి. దివ్యసత్త ఈశుడు. ఆయనే ఆరంభించి పాలించువాడు. ఆయన చేతనాశక్తే ఆమె; మరియు ఉత్తమశక్తి పురుషుని కార్యమును నెరవేర్చునదై, తనయందు ఆయన సృజనాత్మకశక్తి స్థితినికలిగి ఆయన ఉద్దేశ్యమును నెరవేర్చుచున్నది. ఆమె వ్యక్తీకరించునది, ఆయన

వ్యక్తీకరింపబడినవాడు. ఆమె లేనిది ఆయన వ్యక్తీకరింపబడడు, ఆయనలేక ఆమె ఉనికిలేదు.

ఆకృతులు వేరైనసూ సృష్టిని పాలించు మూలసత్యమిదియే. సత్త, శక్తి: పురుషుడు, శక్తి; అను ఈ సంబంధము ఒక ఇరుసువలె నుండుటచే సర్వ చలనములు పరిభ్రమించుచున్నవి. సర్వము సత్తాయందు సంభవించియున్నవి. శక్తివలన అవి నిజస్థితియందు ఏర్పఱచబడినవి. చేతనాశక్తి స్వతస్సిద్ధముగా సత్తాశక్తిని కలిగియున్నది అందుచే సప్తవిధ ఉనికిలు, అనగా ప్రకృతి సృష్టి పరమేశ్వర సత్తానుండి ఆయన దైవశక్తిచే వ్యక్తీకరణమునకు తేబడినవి. వ్యక్తీకరింపబడవలసిన సత్యములు ఆమెయందుంచుకొని, సృష్టియందు వాటిని ఆమెవదలి, పరాత్పరుని అనుమతి ఉద్దేశ్యము ప్రకారము కార్యముల నడుపుచున్నది, అందువలనే ప్రతి వ్యక్తస్తరమునను, సర్వ సృష్టియందును, ఆమె సిద్ధముగాయున్నది.

సర్వ చలనములు, సర్వ కార్యములు, ఆమె ఏకైక చలనముయొక్క భాగములు లేక భావములుగా కడకు తెలియబడుచున్నవి. ఈ ఏకైక చలనము ఈ విశ్వమందు సృష్టిలో దివ్యేచ్ఛ పరిపూర్తివైపుకు; ప్రాథమిక అజ్ఞానాంధకారమునుండి, జ్ఞానతేజస్సుయొక్క ఆవిష్కరణ వైపుకు తీసుకొనిపోవుచున్నది. ఈకార్యము అనంతము. తుదిలేనిది అయినను ఆమెయందది తప్పనిసరియైనది. ఆమె సృజనాత్మకశక్తి, సర్వమునకు మాత:— "ఏతద్ యోనీని భూతాని సర్వాణి" (గీత) ఆమె కొన్ని ఆకృతుల, శక్తుల, ప్రసరణల, మూర్తుల, తన కార్యానుకూలతకు ధరించును. అదే విధముగ పరమేశ్వర సత్తానుండి దైవత్వములకూడ వ్యక్తీకరించును. కష్టభూయిష్టము, అనృతము, అంధకారము అయిన ఈ ప్రపంచములోనికి పరిణామ కాలమున, కొన్ని కష్ట సమయములందు తనకుతానై దిగివచ్చుటకుకూడ సమ్మతించును.

తనే, నేరుగా తనచేతనా శక్తులతో పరమేశ్వరుని ఉద్దేశ్యమును నెరవేర్చును. అటువంటి సమయమిది, అని శ్రీఅరవిందులు చెప్పిరి. సృష్ట్యాదినుంచి శ్రమించు దివ్యశక్తి, నేడు ఈ ప్రపంచమును దాని పరిపూర్ణతవైపునకు తీసికొనిపోవుటకు; భూమిపైని జీవితమును దైవానందమునకు కొంపోవుటకు; భౌతికకాయముతో ప్రపంచ రంగస్థలమున నున్నది. అనికూడ యనిరి. మన ఈ మాతృశ్రీ గారే ఆమె. "మనము ఎవరినైతే శ్రీతల్లిగారు అని పూజించుచున్నామో ఆమె సర్వ అస్తిత్వములను అధిగమించిన దివ్యచేతనా శక్తి".

## ః 2 ః

వేదద్రష్టల మాటలలో ఇటువంటిదె, దైవసృష్టి కర్త్రిణి, సర్వమునకు ఉత్తమమాత. సర్వ ప్రపంచములయందు విస్తరించియున్నది. ఆమె స్వర్గమునకు పైననూ, భూమికి క్రిందనూకూడ విస్తరించియున్నది. "ఆమె శక్తివలననే సర్వము ఉచ్ఛ్వాసనిశ్వాసములను చేయుచు జీవించునది. ఆమె పుట్టుక అంతస్సలిలమున, ఆమె నిగూఢము, అనంతము, అయియున్నది":

(ఋ-వే-10-125)

"ఆమె కార్యక్రమమున నున్నది. వ్యక్తియందును, విశ్వమందును, ఆమె పరాశక్తి. ఆయమ తన జ్ఞానేచ్ఛలచే బహుళత్వమందు కార్యములను జరుపుచున్నది."

(శ్వేతాశ్వేతర 6-8)

మానవుడు తన అజ్ఞానముచే ఆమె ఉనికిని తెలియక ఆమె ఆజ్ఞలను పొరపాటుగ అర్థముచేసుకొని, అపసవ్యమార్గముల నడచును. ఉనికియొక్క-

సత్యమును తెలిసికొను యోగికి దైవవ్యక్తీకరణమును తనయందును, ప్రపంచమునందును పరిపూర్తిచేయుటకు, ఈ యోగక్రమము ప్రకారము, తనకార్యమును, ఆమెను, తెలిసి; ఆమెశక్తికి అర్పణ చేసికొనుటను నేర్వవలయును. ఇట్టిదే ఉత్తమ మానవ కార్యము.

ఈ యోగమునందు ప్రకృతి అజ్ఞానమునుండి విడివడి, ఆత్మస్వాతంత్ర్యమును పొందుట మాత్రమేకాదు. మానవుని పూర్వపు ఆధ్యాత్మికముచే కేంద్రీకృతమైన తపశ్శక్తివలన మాత్రమే ఉత్తమస్థితిని పొందుట కాదు. అంతకన్ననూ ఇంకనూ ఎక్కువే. మానవుని సహజశక్తికంటెనూ మించిన కృత్యము. ఈ మార్గము విమోచనమేకాదు, పరిపూర్ణముకూడ. ఇందు ఆత్మ తన స్వాతంత్ర్యమును బడయుటేకాదు, మానవుని సత్తాయందలి సర్వభాగములు, భౌతికము సర్వము వృద్ధిచెందవలసి యున్నది. అతని ఆత్మేకాదు, సర్వభాగములు దైవసత్తాలే. మానవుని ఆధ్యాత్మిక పరిణామమందు అతని సర్వమూ ఆత్మ, మనస్సు, చింతన, ప్రాణశక్తి, అతని దేహముకూడ యోగసిద్ధియందు పాల్గొని వృద్ధిపొంది వ్యక్తీకరించు దైవము ప్రకారము మారవలసియుండును.

ఈ యోగము వ్యక్తిగతము మాత్రమేకాదు, సామూహికముకూడ, మానవుడు సంఘమునందును, తోడి మానవులతోను జీవించవలసియున్నది. మరి ఈ విశ్వమందలి వివిధశక్తుల కదలికల తాకిడికి తట్టుకోవలసియుండును. మానవుడు స్వతహాగా జీవించలేడు. ప్రపంచవర్తిడులను తట్టుకొని తన సత్తా యొక్క ధృఢతతో ఎదురించవలసి యుండును. ఈ పరస్పర తాకిడులయందును తనచుట్టుయుండెడి అభివృద్ధినిరోధక చలనములవలనను, తన అంతర వృద్ధిని నష్టపడపలసియుండును. సాధారణముగా వ్యక్తియొక్కయు మరియు సంఘముయొక్కయు, చేతనలు పరస్పరము ఘర్షణలుకలిగి యుండును. ఈ

రెంటి చేతనలు పరస్పరసహాయముతో మెలగవలసియుండును. అందువలన ప్రకృతము విశ్వమందుండు శక్తి కన్న మిక్కుటమైనట్టిన్ని, పరిణామము వలన ఏర్పడినట్టిన్ని, సమరసపుఅచు జ్ఞానశక్తి పద్ధతి వలననే ఇట్టికార్యము కావలసియున్నది. ఒక మాటలో చెప్పవలెనన్న విశ్వపరిణామమందలి తర్వాతి మెట్టు అగు సత్యతేజస్సు, లేక విజ్ఞానము వ్యక్తీకరించ బడవలెను అన– ఇంతవరకు వృద్ధిపొందిన మనోభావములన్నియు కేంద్రీకృతమైన దివ్యజ్ఞాన శక్తి, వ్యక్తీకరింప బడవలసియున్నది. భ్రాంతిచెందిన పరిమిత మానవ మనస్సును సరిచేయుటకు, ఇంతవరకు వృద్ధిచెందిన మనస్సును జ్ఞానసిద్ధి స్థితికి తీసికొనిపోవుటకు, అత్యుత్తమ దృక్పథమునకు మనలను తీసికొనిపోవుటకు, తగిన స్థోమత ఆ ఆద్యశక్తి, ఇచ్ఛకే కలదు. ఇంకనూ ఆ సమగ్రజ్ఞానమున ఉత్తమ జ్ఞాన దృక్పథమును, యథాతథముగా తయారుచేయు జ్ఞానేచ్ఛ ఆమెకే కలదు. ఈ జ్ఞానేచ్ఛే శ్రీఅరవిందులు చెప్పిన "అతీత మానస శక్తి". ఇట్టిది అన్నమయ, ప్రాణమయ, మనోమయ ప్రపంచములకు ఊర్ధ్వమున, ఉత్తమ దైవశక్తి, ఆచార్యత్వములతో కూడియున్నది. సాధారణముగా ఆ దివ్యమాత మాత్రమే, తన అద్భుతమైన ఆత్మశక్తిని ఉత్తమ దైవసృష్టి వికాసముకొరకు, వ్యక్తీకరించగలదు.

## 3

కడపటికి వ్యక్తియొక్క పరిపూర్ణత మరియు దాని స్వభావము ఏమి? ఈ యోగమున, పరిపూర్ణత అంటే సర్వ సత్తాల సమగ్రపరిపూర్ణతే. వ్యక్తియొక్క వ్యక్తీకరణమునందు కేంద్రమైన దైవాంశయగు ఆత్మ. ప్రతి జీవియొక్క జీవితమందు తగు విధముగా అభివృద్ధిచెందును. ఈ దైవాంశ జీవితములోని అభివృద్ధిని, అవగాహన చేసికొని వ్యక్తిత్వమును నిలుపుకొనును.

ఆత్మ సంపాదించిన శక్తులతో తగినట్లుగా ప్రకృతియందు వ్యక్తిత్వము ఏర్పఱచుకొనును. ఈ విశ్వపరిణామమందు ఆత్మ పరిపూర్ణముగా దైవస్థితిని పొందుటకు వృద్ధి పొందవలయును అనగా (మిణుగురు) అంశగానుండునది జ్యోతిగా మారవలయును. ఆత్మ స్వరూపమదేవిధముగా అంతస్తున సమగ్ర పరిపూర్ణతను పొందవలెను.

మానవ స్వభావమును వ్యక్తీకరించుటకు చతుర్విధ మూలకారణములు కలవు. అవి జ్ఞానశక్తి, ధృఢశక్తి, సమతాశక్తి, కడపటిది కార్యకారిశక్తి చతుర్విధములుగా విశ్వాత్మ, విరాట్ పురుషుడు, విశ్వచలనమునందున్నాడు. అని వేదము చెప్పుచున్నది (ఋ–10–90–12) మానవునియందీ చతుర్విధ మూలకారణములు ఏదో విధముగా నున్నవి. మానవునియందు ఆలోచించి ఆకలింపు చేసికొని, ఒక నిర్ధారణకువచ్చి, దానిని వృద్ధిపఱచుటకు ప్రయత్నించు భాగమొకటి కలదు. ఇంకొకభాగము తాను తెలిసిన దానిని కార్యాచరణయందు ప్రవేశపెట్టి ధృఢపఱచును. ఆ శక్తి వ్యతిరేకములను పోగొట్టి కార్యమును నెరవేర్చును. మూడవది అతని ఆలోచనలను, చలనములను బాహ్యావాతావరణ ప్రకారము నడచు ఆత్మశక్తిని సమరసపఱచును. అతను తనకు ఇతరులకు, సంబంధించినవాటిని సమరసపఱచుకొని అన్యోన్యసహాయ సంపత్తులను తగినట్లు చేసికొనును. ఇంకొక భాగము కార్యాచరణకు కలదు. జీవితమును, బాహ్య ప్రవర్తనమును తగిన విధముగా సృజించుకొనును. మానవునియందు చతుర్విధ ఆత్మశక్తులు సమతగా ఉండకపోవచ్చును. అతనియందలి మిక్కుటమగు గుణము ప్రకారము జ్ఞాన సంపన్నుడా, క్షాత్ర సంపనుడా, సమరసభావ సంపన్నుడా, లేక క్రియాశీల సంపన్నుడా యని చెప్పుటకు వీలున్నది. మానవునియందీ శక్తులెంత సమరసభావముతో వృద్ధిపొందునో అట్లే అతని వ్యక్తిత్వము ఏర్పడును ఏ గుణముగాని, శక్తిగాని అభివృద్ధిచెందుటకు తగినట్లు ఇతరశక్తులుకూడ సహజముగా

వృద్ధిపొందవలసి యుండును. పరిపూర్ణ ఆత్మవికాసముతో; సమగ్ర ఆదర్శ వ్యక్తిత్వము పొందుటకీ చతుర్విధ శక్తుల పూర్ణాభివృద్ధి అవసరము. ఇట్టి కార్యము మానవశక్తికి మించిన పనియనుటకు సందేహములేదు. ప్రకృతికీ కార్యము వదలిన నూర్ల సంవత్సరములేకాక వేల సంవత్సరములు కూడ పట్టును.

ఇచ్చటకూడ శ్రీఅరవిందులీకార్యసాధనకు, అనగా పరిపూర్ణ సమగ్ర మానవస్వభావ సాధనకు దైవమాత సాయపడుననిరి. పరిణతిచెందు మానవ తకు సాయపడుటకు ఆమె తనను తాను చతుర్విధశక్తులుగా ఏర్పఱచుకొనినది. ఈ సృష్టియందు నిర్మాణమునకు, అభివృద్ధికి, సమతకు, పరిపూర్ణకార్యతకు, విశ్వదేవతామూర్తియొక్క శక్తులు కార్యాచరణయందున్నవి. వాటికిట్లు పేర్కొంచ వచ్చును. మహేశ్వరి: జ్ఞానసంపన్నదేవత, జ్ఞానప్రకాశమునకు తీసికొనిపోగ లది. మహాకాళి: మిక్కిలి దార్ఢ్యముకలిగి అడ్డంకులను తొలగించి సత్యజ్ఞాన మును ప్రసాదించునది. మహాలక్ష్మి: సమత, సౌందర్యము, ఉత్సాహముల ప్రసాదించునది. మహాసరస్వతి: కార్యాచరణయందు పాల్గొని పరిపూర్ణ కార్య సాధనను ప్రసాదించునది. ఈ దివ్య మాతృశక్తులు విశ్వ వ్యాపారమున, మానవునియందాతని ఉన్మీలన— ఆకలింపుల ప్రకారము, తనకార్యముకొఱకు ఏర్పడి యున్నది. దైవ పరిపూర్ణతనుకోరు మానవుడు, తనను, తనచేతనను ఇంకనూ కావలసిన చేతనకొరకు, దివ్యమాతకు అర్పించు కొనవలయును. అప్పుడామె ఈ తన శక్తులవలన మానివునియందు; కష్టమైన సాధనతో బహువిధములుగా ఎదురుతిరిగిన స్వభావములను, చిక్కైన శ్రమతో సరిచేసి, అభివృద్ధికి తగిన ఆవశ్యకతను కలుగచేయును. ఈ చతుర్విధ శక్తులతో సమగ్ర పరిపూర్ణ మానవత్వమును అభివ్యక్తీకరించుటకు ఆద్యశక్తి అయిన ఆదైవమాత సాయపడును.

ఆ దైవ ఆద్యశక్తే ఈ మన మాతృశ్రీ. అందుచే ఈ దైవ మహా ర్త్యమును తగు విధముగా ఉపయోగించెదముగాక

"ఓమ్ ఆనందమయి చైతన్యమయి సత్యమయి పరమే"

అను ఈ దివ్య మంత్రమును శ్రీఅరవిందులు సాధకులకు దివ్య మాతృశ్రీని గూర్చి జపించుటకొసంగిన మంత్రరాజము.

ఇట్టి దివ్య మంత్రరాజమును సదా జపించుచు, మన సర్వస్వమును ఆమెకర్పించి, కార్యములజేయుచు, ఈ దైవముహూర్తమున ఆమె కార్య సాధనకు సాయపడెదముగాక !

# మానవ సంఘ వికాసతత్త్వము

వ్యక్తి, లేక మానవునియందు ఏ సత్యమున్నదో సంఘమందుకూడ అదే సత్యమున్నది. ఏలన సంఘము మానవుల కలయిక. ఆ మానవుల ప్రవృత్తులు, వారి పోకడలు, వారి ఆకాంక్షలు, వారి ఉద్దేశ్యములు వారేర్పఱచుకొనిన సంఘ జీవితమును వెల్లడించును. సంఘము తన అభివృద్ధిని ఏర్పఱచుకొనును, మరియు దాని ప్రత్యేకతను, దాని త్రోవను, అందలి మానవుల ప్రత్యేకతను, మనో స్వభావముల ప్రవృత్తుల వలన, మరియు మానసిక చలనములపైన వారి జీవితము ఏర్పఱచుకొందురు. ఇంకనూ అందలి (సంఘమందలి) వ్యక్తుల జీవిత అభివృద్ధిపై దాని సూక్ష్మ ప్రభావమును నెరపును. ప్రతి సంఘమునకు, దానికి ప్రత్యేకమైన నడత, ఉద్దేశ్యము గమ్యము ఉండును. ఏలన వ్యక్తి ఏ విధముగా దైవమును తెలియచేయ వలసియున్నదో అదే విధముగా ఆ సంఘముకూడ దైవమును తెలియచేయవలసి యున్నది. ఈ వ్యక్తి సంఘము, రెండు దైవమును తెలియచేయుటకు ఉపకరణములే. రెంటి ఉద్దేశ్యము ఒకటే. అనగా రెంటికి అతీతముగాయుండు దానిని కొలుచుచు, దైవమును వ్యక్తీకరించ వలసియున్నది. వ్యక్తిత్వము వ్యక్తియొక్క కేంద్ర ఆకృతియందు దైవమును వెల్లడిచేయును. సంఘము తన జనబాహుళ్యముయొక్క స్థోమతనువెల్లడించును. సంఘమందుండెడి మానవుల గమ్యము ఒకటే. ఆ గమ్యమేదన, దైవసత్యముతో అత్యుత్తమ ఆత్మ పరిపూర్ణత ఆత్మ స్వాతంత్ర్యము, మరియు ఆత్మైక్యత. అనగా ఆధ్యాత్మిక పరిణామమే. మాటలతో లేక వత్తి చెప్పడములో వేరుగాయున్నది. మానవ వ్యక్తియందలి వృద్ధి సంఘమందలి వృద్ధికంటె చైతన్యవంతముగను, శీఘ్రగతిన వుండును.

మానవాభి వృద్ధియందు ఎన్నో అడ్డంకులు. హెచ్చుతగ్గులు. అభివృద్ధి తిరోగమనములు చర్విత చర్వణముగాను అర్థరహితముగాను కనబడును. అది అట్లు కనబడుటి మాత్రమే. మానవ పరిణామాభివృద్ధి ఒక నిర్దిష్ట ఋజు పంథాకాదు. దాని గమనము చర్వితచర్వణము. అట్లన కాలచక్రము దాని చుట్టు అది తిరుగుచు ముందుకుకూడ సాగుచున్నది. మానవ పురోభివృద్ధి పరిభ్రమణలు, క్రమముగా జాగ్రత్తగా జరుగుచు, ఆ పంథాయందలి లాభము లను మానవుడు గ్రహించుచు, తనయందలి అభివృద్ధి కానివాటిని తత్కాల మునకు విడిచి, అభివృద్ధికరములను అవగాహన చేసుకొని జీర్ణించుకొనును.

మానవ సంఘముల అభివృద్ధి, వాటి జీవితము, వాటి వినాశములు మనకుకొన్ని విషయముల తెల్పును. అందునుగురించి శ్రీఅరవిందులు విపు లముగా చెప్పియున్నారు. మరియు ఆ సంఘములు వాటి అభివృద్ధియందు, మానవులను ఒక నిర్దిష్ట గమ్యమునకు కొనిపోవుటను, స్థూలముగా, మనకు గోచరమగును. ఆ అభివృద్ధియందలి ప్రతి ఒక స్థితియందు వర్ధమాన మాన వునియందు బుద్ధి వికాసమునో, మనో వికాసములనో, అభివృద్ధి పరచి వికసింపజేయును.

ఆదిమ సంఘములయందు ఉత్తమ ఊహలు కలిగిన మనస్సు చిహ్న ముగా యున్నది. అప్పుడు మానవుడు బాహ్యప్రకృతి తెలుపుదానిని తెలిసి విచక్షణచే కాక స్ఫురణజ్ఞానముచే కార్యముల చేయుచుండెను. ఉనికియొక్క స్ఫురణను, ఆవరించిన అద్భుతమును, సర్వమునందు స్పందించెడి ప్రాణ శక్తిని కని అనుభవించుచూ ఉండినవారా మానవులు. మహత్తర దైవము నుండి సర్వము, వచ్చుచు బోవుచుండుటగా అతడు తలచెను. బాహ్యమున అంతరమున వుండెడి ప్రాణశక్తి ఒకపేయనియు, మరుగున వుండెడి దేవత లచే పాలింపబడుచూ కార్యముల జరుపుటగా వారు తెలిసిరి. ఊర్ధ్వమున మరుగున నుండెడి దానినుండి ఏర్పడినదిగా ఈ భౌతిక ప్రపంచమును, ఒక

సజీవ చిహ్నముగాతలచి అట్టి ఊహాస్పందనలపై మానవుని జీవితము ఏర్పాటు చబడినట్లుగాను తలచిరి. అటువంటివే హిందూదేశమందలి వేదకాలమునాటి సంఘములు, మరియు ఆదిమ గ్రీకుల, ఈజిప్షియన్ సంఘములు కూడ. ఆ సంఘములు ఎక్కువగా మత సంబంధము, మరియు ఆధ్యాత్మిక సంబంధము కలిగిన ఊహలతో వుండినవి. ఇట్టి కాలమును, ఈ చిహ్నములను నమ్ముటచే, దానిని చిహ్నముల యుగమనవచ్చును. ఏలన భౌతిక జీవితము మరుగునను, ఊర్ధ్వమునను యుండెడి, ఉత్తమజీవిత కృత్యమునకు దీనిని ప్రతిగా వారు తలచిరి. ఈ కాలమున ఆధ్యాత్మిక చింతన మిక్కుటము. అందుచే ఆ కాలమునాటి సంస్థలు, ఆలవాట్లు, ఆచారములు, పరంపరలు, నిత్యకృత్య దైవారాధనలు అన్నియు ఉత్తమ దైవత్వమును వ్యక్తీకరించునవిగా యుండినవి.

దైవోద్దేశము, లేక సత్యము, కొన్ని మానసిక తలంపులను కనుగొనును. ఆ తలంపులు దైవ ఆకృతులుగను, విధానములుగను, వివరింపబడుచుండెడివి. కాలక్రమేణ ఇవి ఒక ఖచ్చిత విధానములు, నిబంధనలుగా ఏర్పడినవి. అందుచే పూర్వపు హైందవ పరంపరయందు, వేదమున చెప్పబడిన విరాట్ పురుషుని సత్యమును,విశ్వదైవత్వమును చతుర్విధచలనములుగా ఇట్లు వర్ణించిరి. దైవమును జ్ఞానముగను, శక్తిగను, పరస్పర సంబంధముచే సృష్టిగను, సేవగను తలచిరి. వారీ విధముగ వారి మనోభావముల ప్రకారము ఆత్మతత్వమును, నైతిక కట్టుబాట్లుగాను ధర్మముగాను నిర్దేశించిరి. ఈ పునాదులమీద వికాసమొందినవి పెక్కు ఆదర్శములు. ఆ యాదర్శములకే వారు కట్టుబడి పాలించబడుచుండిరి. ఈ మానసిక నైతిక కట్టుబాట్లచె, ఒక విధముగ తప్పనిసరియైన మార్పు ఆధ్యాత్మిక ఊహయందే ముందుగానే ఏర్పడినది. ధర్మము ప్రాముఖ్యముకాని నైతికము మాత్రమే ముందుకువచ్చి ఆచరింపబడుచుండినది. ఇట్టి కాలమును విధాన కాలము లేక వర్ణాశ్రమ కాల

మనవచ్చును. ఆదిలో స్ఫురించిన సత్యము, ఈ విధముగా అనేక ఆదర్శ ములుగా ఏర్పడుటచే కొంతవరకు, మరుగున పడినది. సత్యము సత్యశాస నకు తావిచ్చి ఆ శాసనమే ఒక ధర్మముగా ఏర్పడినది. ఈ కాలము అనేక సంఘ ఆదర్శములకు విలువ ఇచ్చినది. ఉత్తమ ఆధ్యాత్మిక మనస్సు కల బ్రాహ్మణుని, క్షాత్ర ధర్మముకల క్షత్రియుని, సరళమైన గుణముకలిగి పరో పకారియగు వైశ్యుని, శ్రద్ధాభక్తులతో సేవచేయు శూద్రుని. వీరినందరిని. ఈ కాలమున ఉత్తమ స్థితిలో చూడనగును.

కాని కొంతకాలమునకీ స్థితినికూడ ముగియుట చూచితిమి. అప్పుడు యాంత్రికముగా సంఘములు, మతములు మరియు ఇతరములు అభివృద్ధి చెంది బహువిధ శాసనములు ఏర్పడినవి. సాంఘిక భావములు, మత భావములు మరియు ఒకవిధమైన ఏర్పాట్లు, వాటి వ్యవస్థ ప్రకారము నడుచు కొను భావములు వచ్చినవి. ఈ భావములువచ్చి మానవుని మానసికమును కట్టుబాటుచేసి, మొదటి ఆధ్యాత్మిక మనో భావములను వెనుకకు నెట్టినవి. ఇట్టి భావముల వలననే పూర్తిగా సంఘములు కట్టుబడిచేసి స్థిరపడినవి. దీనిని సాంకేతిక కాలమని చెప్పవచ్చును. ఇట్టి కాలములో ఆచార వ్యవ హారములు మీరని కట్టుబాట్లు ఏర్పడినవి. ఇట్టి స్థితి బుదునికి పూర్వము హిందూదేశమునను, మధ్యయుగమునాటి యూరోపునను, ఉండినది. ఈ నిబంధనల కష్టతర కటుబాట్లు వలన మానవ మనస్సు తిరగబడి కడకు ఈ స్థితిని వ్యతిరేకించినది.

అందువలన, తర్వాతి మానవుడు విచక్షణతోను వ్యవహరించు కాల మునకు దారి తీసినది. అధికారముతోను, మిత భావములతోను లౌకిక భావ ములతోను, పవిత్రభావమొనర్చిన పరంపరా ప్రాప్తిముతోను, ఏర్పరచిన విషయములను, మానవుడు యథాతథముగాను, గుడ్డిగాను, అంగీకరించడు,

వ్యక్తిత్వముతోను, విచక్షణతోను, పరీక్షించి విషయముల అంగీకరించుటనే ఈ కాలపు మానవుడు కోరును. మానవ విచక్షణా మనస్సు పరీక్షించి అంగీకరించిననే తప్ప ఇతరములను గుడ్డిగా అంగీకరించడు. నూతన పంథాలు విధానలుఇ ముందులకు వృద్ధిచేయబడినవి. ఇట్టి విచక్షణ, ఒక విధముగ మేలే చేసినది. ఏమన ఆధ్యాత్మికమునకు అభివృద్ధి నిరోధకములగు, దురభిమానమును, నిబంధనను, పిచ్చి భ్రమలను విడనాడుటే. అందువలన మార్గము కొంతవరకు విశదము చేయబడినది. మానవ మనస్సుచే జాతిని ఆంతరికాభివృద్ది వైపునకు గొంపోవుటకు అవకాశ మేర్పడినది. ఇట్టి విచక్షణా జ్ఞానము వలన ఏర్పడిన అభివృద్ధికర విషయములలో ముఖ్యమైనది. భౌతిక శాస్త్రము; కాని ఈ విచక్షణ భౌతిక శాస్త్రమువరకే నిలబడుచున్నది. మానవుని విచక్షణకందని వాటిని మానవమనస్సు ఒప్పుకొనుటలేదు. ఉత్తమ భౌతికమునుండి ఏర్పడిన మానవ సాధారణ జ్ఞానము, ఉత్తమ కక్ష్యలు కలవని వొప్పుకొనుటలేదు. అభివృద్ధిచెందు ఆధ్యాత్మికము ఈ పరిధులను తప్పక దాటి అద్భుత విశాల భావముల పొందవలెను; అప్పుడీ విచక్షణ విభ్రాంతి పడవలసిందే.

మానవ మనస్సు విధిలేక సరియైన శిక్షణకు, సత్యవిధానమునకు, మానవునికి సంఘమునకు తగినట్టి విశాలమైన ఆంతర ఉనికియొక్క భావముల ననుసరించి వ్యవహరించుటకు ఆలోచించును. ఇట్టి కాలస్థితినిబట్టి కర్తృత్వకాల మాసన్న మైనదవి చెప్పుటకు వీలగును. విచక్షణ భౌతిక పదార్థముపై కాక ప్రాణశక్తులపైకి మరలినది. కొంతకాలమూ విచక్షణ, ప్రాణశక్తి సత్యమును ప్రాణక్తియొక్క ఇచ్ఛా సత్యమును, కనుగొనుటకు వృద్ధిపొందెను. మానవ చేతనాశక్తివలన సువిశాల స్తరములందు నూతన శక్తులను కనుగొనును. కాని సాధారణ మానవ మనస్సు ఉపరి భాగముల మాత్రమే తెలిసికొనెను. మనోతత్వ శాస్త్రము ఇతర ఘనతర శాస్త్రములు

నూతన కర్తృత్వ పంథాలను కనుగొనుటకు ప్రయత్నించెను. కొంతమేలు జరిగినది. నూతన జ్ఞానమావిర్భవించినది. కాని సంఘమును మానవుని ఉత్తమముగా సమరస పరుచుటకు తగిన త్రోవ కనబడలేదు.

కాని ఈదారి తప్పుదారికాదు. ఈ దారి ఆత్మ లేక వ్యక్తపరుపబడ వలసిన ఆధ్యాత్మ కేంద్రము వైపుకు పోవుచున్నది. బహుముఖముగా మాన-వుని పురోభివృద్ధికి, దారి తెలియుటకు కావలసిన ఉపాయము భౌతికముగగాని, ప్రాణికముగగాని, మానసికముగగాని, తెలియలేదనుట ఎల్లరుఅనుకొనునదే, వివిధముల సమరసపరచుటకు సామరస్యమైన పురోభివృద్ధికి స్వాతంత్ర్య లక్ష్యమును చేరుటకు, పరిపూర్ణతకు, సమైక్యతకు ఆత్మస్థరముననే ఉపాయ మును కనుగొనవలసియున్నది. ఆధ్యాత్మిక చేతనను, జాతియందు ప్రేరే పించి తోడి మానవ సత్తాలను తప్పనిసరియైన దైవమూలములో కనుగొని, ఏకీభవించుటే ఆ ఉపాయము — ఇట్టి ఉద్దేశ్యమేర్పడినదంటే ఆధ్యాత్మిక కాల మాసన్నమయినదని చెప్పవచ్చును. అందులకు అన్ని కర్తృత్వ మార్గములు ఆ వైపునకు పురోగమించును.

అపనమ్మకమునకు ఆధ్యాత్మచేతన ఎన్నటికి విశదపడదు. సర్వకాల ములందు, సర్వదేశములందు ఆధ్యాత్మచేతన ఉనికిని ఆధ్యాత్మ చేతనా మాన వత్వమును వివిధముగాను, ఉన్నతముగాను తెల్పిరి. ఇప్పుడు కష్టించు భూమాతచే కోరబడినదేదనగా, మానవుడు ఆధ్యాత్మ జీవితమును నెరవేర్చుటకు తగిన విధానముల చేపట్టుచూ, తోడి మానవులకు ఆ జీవితములు జరుపుటకు తోడ్పడమే. అందుకు సాధారణ మానవ మనోచేతనను అధిగమించి భౌతిక ప్రాణ కక్ష్య విధానపరిధిలో శ్రమించి, అధిగమించి, స్వతసిద్ధశక్తికల, ఆత్మ ప్రేమ, సౌందర్యము, సమత, ఇచ్ఛ, జ్ఞానము అను ఆధ్యాత్మ చేతనా స్థాన

మునుచేర వీలగును. అట్లు అధిగమించిన పై గుణములు వాటంతటవే ఉద్భవించును.

తాను వృద్ధిపొంది ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును పొందుటకు బాహ్యము నుండి కట్టుబాట్లు లేకుండ, తన చేతనాశక్తుల అభివృద్ధిచే తోటి సర్వమును అభివృద్ధిపరచుటకు, తగిన వాతావరణము సంఘమునకుండవలయును. తన పరిసరములకాతడు సాయపడును. ఈ శ్రీ అరవిందజ్ఞానముకు, అత్యుత్తమ మూలజ్ఞానేచ్ఛనేపొందు అవకాశమున్నది. ఎట్లన మానవక్రమపరిణామముచే ఈ ఉత్తమ దశలనుబొంది అటులనే సంఘమును తయారుచేసి పరిపూర్ణత అను గమ్యముచేరుటే శ్రీ అరవిందయోగముయొక్క ఉద్దేశ్యము.



# మానవ ఐక్యతాదర్శము

వ్యక్తి, సంఘము వీటియొక్క సమస్య ఏదో, సంఘముల సమిష్టి, లేక మానవజాతియొక్క సమస్యఅదే. మానవుని, అతని పరిసర సంఘ ముల సాధనోపాయములు తరచి ఏర్పఱచబడినవి: శ్రీ అరవిందులు వాటి మూల ప్రతిపాదన ఒకటే యనిరి. ఆత్మ లేక దైవ సత్యము ఒకటే వ్యక్తి యంతటి ఏకత్వముగా యుండును. మానవ సమిష్టియందది బహు విధము లుగా నుండును. సంఘము. ఈ సమిష్టి మానవులందు మధ్యంతరముది. పునాదియందు సర్వమునకు ఐక్యత ఏర్పడియున్నది. ఈ సత్యస్థితిని, ఈ మూల ఐక్య పద్ధతిని తెలిసికొని, ఇతరులతోటి ఐక్యత ననుభవించుటయను ఈ గొప్ప చిక్కునకు ఉపాయము, కనుగొనవలసియున్నది.

ఈ పరిణామ క్రమమునకు ఐక్యతే పునాది మరియు శిఖరముకూడ. పునాదియందు సర్వము ఒకటే. ప్రాణము ఏర్పడిన తర్వాతనే ఈ ఐక్యత భిన్నముగా కనబడుచున్నది. ఆకృతుల బహుళత ఏర్పడుచున్నది. ఇట్లేర్పడిన తర్వాత, చేతనాభావ మేర్పడి అందుకుపకరణమైన మనస్సేర్పడినది. ఈ మానసిక చేతనచే ప్రకృతిలో క్రమక్రమముగా, ఈ వికసించిన వైవిధ్యమున సత్యఐక్యతను కనుగొనుటకు, ప్రయత్నము జరుపబడుచున్నది. జంతుజాల ములందుకూడ ఈ కూటమిని (ఒకటిగా చేరుట) చూడగలము. ఈ జీవ జంతువుల జాతి సమూహములందు వాటి ఏర్పాట్లనుకూడ చూడవగును. పరిణామము వలన ఏర్పడిన, మరియు చేతనాసత్త కల మానవులయందీ కూటమిని, బాగుగా చూడనగును.

నుండే ఈ ఉద్యమమును నెరవేర్చుటకు వీలున్నదనిరి. జాతి, అందలి మాన వులు వారి హృదయములందు, ప్రతి ఒక జాతియొక్కయు. ఆ సమాఖ్య యొక్కయు స్వాతంత్ర్యహర్హతలను గుర్తించవలెను. మరియు దాని స్వేచ్ఛ ప్రకారము వృద్ధిపొందుటకు అడ్డుపడకూడదు. సర్వ సమాఖ్యలు అదే విధ ముగా, వాటి స్వభావ ప్రకారము వృద్ధిపొందుటకు, ఏలాటి అడ్డంకులు ఉండ కూడదు. మానవాళి దాని అగాధ చేతనాస్థితికిపోయిననే ఇది సాధ్యము. అప్పుడు ప్రతిసమాఖ్య, ఇతరములతోటి ఐక్యతనుచూచి, అనుభవించును. అంతేకాక ఏక్యతయొక్క సాధారణ కోరిక, అనుభవము దాని కార్యమును కూడ కనుగొనును. ఒక మాటలో చెప్పవలెనన్న మానవుడు, ఆధ్యాత్మిక మత మునకు, ఉన్మీలుడవు కావలెనని—

## 2

ఇంతకూ ఈ ఐక్యమానవత, అను ప్రాధమిక సత్యము, నూతన మైనది కాదు.

వేల సంవత్సరములకు మునుపే ఆర్య ఋషులు వేదములలో ఉద్ఘాటించి యున్నారు.

"కలసి యుండుడు, ఒకే మాట మాట్లాడుడు, మీ మనస్సులను ఒకే జ్ఞానము వైపుకు మరల్చుడు. దేవతలుకూడ ఒకే జ్ఞానమును పొంది వారి వారి భాగముల యందు ఒకటిగా పనిచేయుచున్నారు. మీ మనస్సులు ఒకే జ్ఞానము వైపుకు మరల్చుడు.

"వీరందరికి ఒకే రకమగు మంత్రము, ఒకే విధమగు సంఘము, సర్వుల మానసికము కూడ ఒకటే. ఒకే జ్ఞానమందు వారు కలసియున్నారు."

"మీ సర్వులయొక్క ఆకాంక్ష ఒకటిగానే యుండనీ, మీ హృదయములు ఐక్యముగ నుండనీ, మీ మనస్సులు కూడ ఒకేమాదిరి ఉండనీ. అట్లుండుటచే మీకు సన్నిహిత సాహచర్యముండగలదు" (ఋ-10-191)

ఇట్టి సత్యేచ్ఛ మాత్రమే ఆదిమజాతి స్ఫురణ మానసికముపై సాధారణముగ ప్రసరించి యుండినది; దాని పరిసమాప్తి అనగా, సత్య ఐక్యత, ఏర్పడవలసియున్నది. పదునెనిమిదవ శతాబ్దము వరకు అది ఒక ఆదర్శముగానే నుండి, అ యాదర్శము పరిమితముగా కొన్ని నినాదములతో తల ఎత్తినది. స్వతంత్రము సమత్వము, మరియు సమాజములు కావలయునని. ఏ ఉద్దేశ్యముతోనైనను ఈ నినాదములు లేవనెత్తిననూ, వాటి తప్పనిసరి అయిన ఉద్దేశ్యము స్వతంత్రభావము, మరియు సర్వ జనులయందు భ్రాతృభావమును మొలకెత్తించుటకే. ఈ భావము బహు నామములతో ఏర్పడినది. ఉదాహరణకు, మానవతా భావము, సాంఘిక భావము, ప్రజా ప్రభుత్వ భావము— మొదలగునవి. శాస్త్రము, దాని విభాగముల వలన కలిగిన పురోభివృద్ధి, విజ్ఞానము. ప్రపంచమునందలి సుమార ప్రజల మనస్సులపై కూడ ప్రసరించి, వారెంత దూరమందుండినను, సన్నిహితుల చేసినది. అందువలన మానవులు వారి ప్రపంచము ఒకటేయను ఉద్దేశ్యమేర్పడినది. పురోభివృద్ధి యందు, గమ్యమునందు, సౌఖ్య విషయములందు ఐక్యభావమేర్పడి ఇంకనూ ఇతర విషయమిలపై ఐక్యభావమేర్పడుటకు ప్రయత్నము జరుగుచున్నది. రాజకీయ సంబంధములైన, మితవ్యయముపైన ఏర్పడు విరుద్ధభావములు చాలవరకు తగ్గుటకు తగు ప్రయత్నములు చేయబడుచున్నవి. ఈ అభివృద్ధిచే వస్తుతః మార్పు నిజముగా కనబడలేదు. ఈ విషయములు జరుగుచున్ననూ, మానవ

నాగరికత యందలి తిరోగమనమును నిలుపలేదు. మన జీవిత కాలమందే అటువంటి తిరోగమనములను (యుద్ధములను) రెంటిని చూచితిమి. ప్రకటమగుపడునది, యాంత్రికమైన ఐక్యతే, సజీవ ఐక్యతలుకావు. పేరుకు స్వతంత్రతే, వస్తుతః కాదు. పేరుకు సమానావకాశములే కాని, నిజమునకు జీవితమందు సమానావకాశము లేదు. కాని కొంత అభివృద్ధి ఏర్పడినదిమాత్రము సత్యము. ఇంతవరకు ఐక్యతకు జరిగిన ఏర్పాట్లు బాహ్యాముగానైనసూ రాబోవు మానవ ఐక్యతకు కావలసిన చట్ట క్రమమనవచ్చును. ఇంతవరకు పురోగమించిన అభివృద్ధి పరిమితమైనదే. ఈ అభివృద్ధియొక్క జయాపజయములు కొంత మేలేచేసినవి. అపజయములు, మలి ప్రయత్నములో కార్యముల సరిగా చేసికొనుటకు, వీలు కలిగించినవి.

జాతీయము లేక ప్రపంచముయొక్క శాసనము యాంత్రికమైన ఐక్యతను తెచ్చునవెడి అభిప్రాయము ఎక్కువగా ఏర్పడినది. బాహ్యవిషయమైన ఐక్యతే కాక మానసికమైన ఐక్యతకూడ సజీవమైనదిగా యుండవలయును. ఈ మానసిక ఐక్యత హృదయాంతర దైవత్వమునందు ఏర్పడిననే తప్ప, మరే విధమునను అది నిలబడదు. ఆ ఐక్యత ఆత్మ పరమైనదిన్ని. మానవునియందలి దైవ సంబంధమైన, ప్రేమ, సమత, భ్రాతృభావములతో నిండియుండ గలదు. పాశ్చాత్య విధమగు యాంత్రిక ఐక్యతచే, జీవితపద్ధతులను క్రమమొనర్చుటలో కూడ, నిజమైనఐక్యతను తేలేదు. ఐక్యత మరియు ఒకే ఆశయము కలిగి యుండవలయును. కాని ప్రకృతి మాతయందు జీవిత వైవిధ్యము ఉండవలయును. ఇట్టి వైవిధ్యము మానవ సమూహములందు కూడ ఉండవలసియున్నది. ప్రపంచ (జాతి) సమాఖ్య అట్టి సరళ ఐక్యత వైపుకు నిధానముగా ప్రయాణించుచున్నది. ఈ ప్రయాణము అంతస్తునసుం డెడి ఆత్మయొక్క అగాధ ప్రేరణలచే కలిగినది. అట్టిదే ప్రతివారికి స్వాతంత్ర్యము భద్రతను చేకూర్చును. అంతేకాక వ్యక్తి, సంఘము, వృద్ధిపొంది

అధ్యాత్మ వ్యక్తీకరణను, అహ్లాదముతో వెల్లడించవలయును. ఈ ప్రపంచ ఐక్యత ఏ రూపముతో ఎప్పుడు వెల్లడియగును అని చెప్పుటకు ఇప్పుడు వీలు లేదు. గమ్యము అను దానియందు చరిత్రయొక్క శక్తులు, సాధ్యతలు, సంభావ్యములు, ఎన్నో కలవు. కాని ఒకటిమటుకు చెప్పవచ్చును, ఈ ప్రయోగము ఏ రూపముగాని, తదనుసరణీయములు తీసికొననీ, అది ఒకరికొకరు లొంగియుండని మరియు పెద్దరాజ్యముకాని, చిన్న రాజ్యముకాని, సమానావకాశముతో ప్రపంచ స్వతంత్ర్య రాజ్య సమాఖ్యగా ఏర్పడును.

ఇట్టి ఐక్యత వెల్లడించుటకు శ్రీ అరవిందుల ఉద్దేశ్య ఆదర్శ ప్రకారమున్ను శ్రీమాతగారి స్వప్నము ననుసరించిన్ని, బాహ్యముగా కన్పట్టుటకు 'ఆ రో వి ల్' పట్టణమందు, ప్రపంచమందలి సర్వ ప్రజలు, సమాన అవకాశముతోను, సత్య ఐక్యతతోను, దైవ ఉపకరణములుగా పనిచేయుటకు యేర్పఱచి, ఆచరణయందుంచుటకు కృషి జరుగుచున్నది. ఈ "ఉదయపురి" ఏర్పాటుకు సర్వ ప్రపంచ ప్రజలు, ఐక్యభావముతో, తమ సర్వ సత్తాతో పనిచేసి, శ్రీతల్లిగారి ఉద్దేశ ఆదర్శమును, నెరవేర్చునట్లు చూడవలసి యున్నది.

---

## సర్వ సమర్పణ

శ్లో॥ జపో జల్పః శిల్పం సకలమపి ముద్రావిరచనా
గతిఃప్రాదక్షిణ్య క్రమణమశనాద్యాహుతి విధిః
ప్రణామః సంవేశః సుఖమఖిలమాత్మార్పణదృశా
సపర్యాపర్యాయస్తవ భవతు యన్మే విలసితమ్॥

ఆనందలహరి 27 శ్లో॥ —శ్రీ శంకరాచార్య

---

# నిగూఢ వేదరహస్యము

శ్రీఅరవిందులు చెప్పెడిది వేదమందలి రహస్యము అని చెప్ప వచ్చును. ఈ విషయములు యోగసిద్ధివలన సత్య దృశ్యములపై ఆధారపడి యున్నవి. ఈ జ్ఞానముయొక్క నిజానిజములను ఎవరైనను పరీక్షించుకొన వచ్చును. కాని అందుకు తగినవిధానమును అనుసరించవలయును, అనగా దానికి తగిన యోగమార్గ క్రమమున నడువవలయును. ఈ సత్యజ్ఞానమును పరీక్షించుటకు బాహ్య సహాయములు అనవసరము. దానిని ప్రస్తుతించుటకు కాని, వ్యతిరేకముగా మాట్లాడుటకుగాని బాహ్యఉపకరణములు అనవసరము. ఇందు, చరిత్రకు పూర్వమునుండి వచ్చిన హైందవ ఆధ్యాత్మిక విధానము, ఎంతవరకు ఉత్తమ జ్ఞానకర్మలకు సరిపోవును అని చూచుట చాలఅక్కఱయై నదిన్ని మరియు జ్ఞానవర్ధకమైనదికూడ. ఈ విధానము వేదమునందున్ను, ఉపనిషత్తులయందు మరియు గీతయందు చెప్పబడినది. శ్రీఅరవిందుల పూర్ణయోగము ఎంతవరకు వీటిని అనుసరించును అనుటను తెలియ వలయును. ఈ యోగమును సర్వ జీవితమును, దైవ వ్యక్తీకరణముగా భావించి, దాని విధానము తప్పనిసరియైన దైవ వ్యక్తీకరణమని తలంచి, అజ్ఞాన, అశక్తి, మరణ విధానములను, అధికాధికముగా జ్ఞాన, శక్తి, అమృత విధానములచే పూరించ వలయును. శ్రీఅరవిందులీ పురాతనపు మరియు అనంత భావములు కల వేదములను తరచి వారి దివ్య జీవనము (The Life Divine) అను గ్రంథమునందును, అందులకు విధానములను యోగ సమన్వయము (Synthesis of Yoga) నందును వెల్లడించిరి. వేద మంత్రములను, ప్రకృత్యారాధకులైన ఆర్యుల మరియు ఆదిమ జాతుల చరిత్రను పాశ్చాత్య విద్యాజ్ఞానముతో స్థూలముగా చదువుటను శ్రీఅరవిందులు నిరసింతురు. ఈ పాశ్చాత్య విద్యావంతులు ఈ మంత్రములు

ఆటవిక ప్రజల ప్రాధమిక సంఘాభివృద్ధి యందేర్పడిన వందురు. మరియు దేవతలుగా భౌతిక ప్రకృతి శక్తులను ఆరాధించు మంత్రములనిరి. అట్టి విద్యావంతులు, సామాన్యముగా యజ్ఞ యాగముల చేయుటకీ మంత్రముల, పద్ధతుల ఉపయోగించుట వీటి అర్థమనుటను కూడ వొప్పుకొనరు. కాని శ్రీఅరవిందులు వేదము అనగా "జ్ఞానకాండ" (విద్- తెలియుట) అని యనుకొనిరి. అట్టి భావమే భారతదేశమున నున్నది. అదే విధముగనే ఋషుల యొక్కయు దైవసమానులగు మానవుల యొక్కయు వాక్కులు హిందూ దేశమునకు స్వంతమైన జీవిత విధానముపై ఆధారముతో ఏర్పడిన ఏకైక జ్ఞాన సముద్రము, శృతి, లేక వేదము అని యనిరి.

వేదమంత్ర కర్తలు సాధారణముగా పద్యములల్లు కవులుకారు. సత్యమును వినిన ద్రష్టలు, అనగా "సత్యశ్రుతః కవయః" అట్లు ఆ 'వాక్కును' తెలిపిరి. హృద్గతమునుండి వచ్చిన వాక్కును "హృద్ స్థం మంత్రం" వారు వారి నిగూఢరహస్యములో తెలిసినవారు, ప్రథమ ఆర్య సంఘముల నేర్పరచినవారు. అట్టివారాకాలమున అన్ని దేశములయందు- ఈజిప్టు, గ్రీసు పర్షియా, ఛాల్డి అన్ని దేశములందు ఉండిరి. అన్ని దేశములందు ఆకాలపు జనులు వారి జీవితమును జీవిత అంతర సంస్కృతిని, ఆత్మాభివృద్ధిని ద్విముఖముగా అనగా వ్యక్తిగతము మరియు ప్రపంచగతము అయిన జ్ఞానమును వృద్ధిపరచిరి. వేద ఋషులిట్టి స్వభావము కలవారు.

వారు జీవించినకాలమందలి మానవ మనస్సుయొక్క జ్ఞానము తర్కించునదికాదు. ఇచ్ఛాశక్తుల వలన పాలింపబడు స్థితి. మరియు ఆటంక పరుపబడని స్ఫురణ జ్ఞానము కల ప్రజగా వారుండిరి. అప్పటి మేధావంతులు సర్వమందు సత్యమును, ప్రపంచావిర్భవమందలి భౌతిక వస్తువుల వెనుక నుండెడి సత్యమును చూచుచు తెలిపిన విషయములే. బహువిధ ప్రకృతి వెనుక ఉన్న ఐక్యతను చూచిరి. వారి అంతరవృద్ధి సమయములందు, భౌతిక

ప్రకృతి వస్తువుల వెనుక. వాటిని పాలించు శక్తులను చూచిరి. భౌతిక ప్రపంచమందే కాక అంతస్తునందలి భౌతిక పరిమితమండలమును చూచిరి. అంతర ప్రకృతిపై ఆధిపత్యము వహించుటకు. బాహ్య ప్రకృతిపై ఆధిపత్యము వహించుటకు, ఆ వేద ఋషులు దేవతలతోను వారి శక్తులతోను సంబంధముంచుకొని పూజించి ఉపాసన చేయుచుండిరి.

ఈ ఋషుల దృష్టిలో ఈ భౌతిక ప్రపంచము ఒక భాగము, నాల్గవ భాగమే, విశ్వవిస్తృతియందు అట్టడుగుదియని తలచిరి. దీని వెనుకను, ఊర్ధ్వముననూ ఇతర ప్రపంచముల చూచిరి. క్రమముగా శక్తివంతమైన, జ్ఞానవంతమైన, తేజోవంతమైన, ఆనందదాయకమైన ప్రపంచముల కనిరి. వాటిని కని, వాటిని చేరుటకు విధానములను కనుగొని, సాధారణ మానవుల కందని తేజోవంతమైన జీవితమును గడుపుచుండిరి. ఈ సృష్టి క్రమమును అధిష్టించిన ప్రతిస్థర దేవతలను ఒకటిగా గాని, సమిష్టిగా గాని వారా రాధించుటకు కారణమిదే. ఆ విధముగా అగ్నిదేవుని భూమిని అధిష్టించినవాడుగాను, అనగా భౌతిక ప్రకృతి అధిపతిగాను; వాయుదేవుని ఆకాశదైవముగా బాహ్య వాతావరణ దేవతగాను, జీవితము వృద్ధిచేసికొనుటకు; ఇంద్రుని స్వర్గ ప్రభువుగా, మనస్సును అభివృద్ధిజేయు దైవముగా వారు ప్రార్థించిరి. ఈ దేవతల నందరిని సర్వ దేవతలను తననుండి ఏర్పరచు ఒకేదైవముయొక్క బహుముఖములుగా "మహత్ ఏకమ్" పూజించిరి. ఈ దైవములు తేజోవంతమైన, అనంత సృజనాత్మక చైతన్యముకల అదితిబిడ్డలు. ఆ దేవతల కార్యము (బాధ్యత); విశ్వమందు పాల్గొని భూమి పుత్రుడైన మానవునికి సాయ మొనర్చి, ఆతను ఉన్నత సత్యమువైపునకు ప్రయాణ మొనర్చునట్లు చేసి అమృతత్వమును, సత్యమునూ ప్రసాదించునట్టివిగా యున్నవి. మానవుడా దేవతలను పూజలచేతను, యజ్ఞయాగాదుల వలన తననూ తన సర్వమును అర్పించుకొని ఆరాధించుటచే వారు తృప్తిచెంది ప్రతిఫల మిచ్చెదరు. ఈ

మానవాభివృద్ధి సత్తాయనెడి కొండపై శిఖరముల మాదిరి యుండును. ''సోనః సోనం'' ఈ ప్రయాణము లేక అభివృద్ధి ఒక యుద్ధముగా కూడ వర్ణించవచ్చును. ఏలన అభివృద్ధి కార్యక్రమమున మానవుడు దితి బిడ్డలైన అనృత అజ్ఞాన శక్తులు అనగా చేతనా ద్విత్వముచే అడ్డంకులను ఎదుర్కొని గెలువ వలసి యుండును. దేవతలు మానవుని కొరకు అతని అంతస్తున అనృత శక్తులతో పోరాడి మానవునికి జయమును కలిగించెదరు.

ఇట్టి దానినే ఋషులయొక్క సంక్షిప్త బోధ అని యనవచ్చును. ఇతర దేశములలో వలెనే మన దేశములో కూడ ఇటి జ్ఞానమును, ప్రజ్ఞావంతులైన కొందరికే ఉపదేశింపబడు చుండినది. ఇతరులకు అనగా సామాన్య ప్రజకు, మతము, వ్రతములను, ఊహాజనితమైన కేంద్ర సత్యముపై ఏర్పరచి అనుస రించమనిరి. అందుచే ఉపదేశింప బడినవారికి ఆంతరార్థము బాగా తెలియును. ఇతరులకు బాహ్యాచట్టములు నిబంధనలు చాలుననిరి. ఈ బాహ్యానిబంధనలు, ఆరాధనలు కూడ శక్తిమంతములైనవై యున్నవి. రహస్యవేత్తల మాట లలో పూజా తంత్రము, మంత్రములు, బాహ్యాంతర వృద్ధిని కలిగించు శక్తి కలవిగా యున్నవి.

ఈ విధముగా వేద ద్రష్టలు, లేక ఋషులు, వారి భావములను, వివిధ అర్చనా విధములను వెల్లడించవలసిన వానిని ద్వ్యర్థ విధానముగా తెల్పిరి. ఆ కాలమునాటికి ఉండిన భాషచే ఇట్లు ప్రత్యేకవిధానముగా తెల్పిరి. అప్పటికి మాటలు అనుభవ సజీవములైనవిగను, గ్రాహ్యాచరణములుగను ఉండియుం డెను. ప్రతి అక్షర ధాతువునకు బహు అర్థములుండుటచే బహు విధములుగా అర్థము చెప్పుటకు వీలున్నది. ఉదాహరణకు 'వృక' యను శబ్దమునకు తోడేలు అని యర్థము. 'వృక' ధాతువునుండి ఏర్పడినది. అందుల కర్థము చీల్చుటయని, చీల్చు గుణము తోడేలుకున్నది కాబట్టి 'వృక' యను పదమును వాడిరి. అందుచే దేనినైన బాగించుటకాని, చీల్చుటకాని తెల్పును. అటులనే

'గో' శబ్దమునకు ఆవు, కిరణము, వెలుగుయొక్క కిరణమని అర్థములు చెప్పవచ్చును. ఋషులీ బహు అర్థములనిచ్చు ఆ కాలపు సంస్కృత పదము లనువాడి వేద మంత్రశాస్త్రమును తయారుచేయగలిగిరి. ఉపదేశము పొందిన వారికి గుప్తవిధానము తెలియునట్లగును. సాధారణ ప్రజకు వేరు విధమైన అర్థ మిచ్చునట్లుగను ఆచ్ఛాదనతో తెల్పిరి.

ఇతంకు ఋషులచే రహస్యముగా చెప్పడినదేయది. వారి మాటలలో "నిన్యవచాంసి" గుప్తపదములు— జ్ఞాననేత్రము కలవారికే ఈ జ్ఞానమును తెలియపరుచుటకుఏర్పరచిరి. ద్రష్ట ''కావ్యాని నివచనాని కవయే''. అనుటచే పై విధముగ తెలియవలయును.

## 2

మానవ ప్రపంచము, అజ్ఞానము అనెడి నీడయందుండు ప్రపంచము. ఇది అనృత అజ్ఞానములచే నిండియుండుటచే మానవుడు తన జీవితమును. మనస్సును, దేహమును, అవయవములను వాటి పరిపూర్ణతతో వాడుకొనుట లేదు. ఇది పూర్ణసత్యముకాదు. కాని అపరిపూర్ణమై. కుచ్ఛితములతో నిండి నటుల గోచరించుచున్ననూ ఈసృష్టికి పైన అనంత శక్తికల సత్యము. కేవల జ్ఞానము. అపరిమిత ఆనందము. అమృతత్వము ఉన్నది. వేద ద్రష్టలు మానవజీవితమందీ ఉత్తమ జీవితాకాంక్షను చూచిరి. జ్ఞాన శక్త్యానందముల ధామము తేజోవంతమైన అద్భుత లోకము ''మహస్'' ఒకటి యున్నది. అదే నిజమైన మూలము, ఆధారము; మన విశ్వమునకు ఊర్ధ్వమునయున్నది. 'ఉపరిబుధ్న' అది, విశాల స్వర్గము 'బృహత్‌ద్యాయుః'. మన భూమ్యాకాశ స్వర్గములకు ఊర్ధ్వమున నున్నది. స్పష్టమైనది, సత్యమైనది, విశాలమైనదిగా యున్నది. లేక 'సత్యం, ఋతం బృహత్' అని చెప్పబడియున్నది. ఋషి

తన చేతనయందా కాంక్షించిన పరిపూర్ణది సత్య గృహమునే. "సదనం ఈ కార్యము కొరకే. దేవతల- అనగా అగ్ని, ఇంద్ర, వాయు, సూర్య, ఋతస్య". బృహస్పతుల నిరత సహాయమును,ఆత్మార్పణచే కోరుదుము. అప్పుడా దేవతలు వారిశక్తిని అతనియందు నింపి, వారి చేతనల నాతని సత్తాలో నింపి సత్యమార్గ ప్రయాణమును చేయించుదురు. 'ఋతస్యపంథా' ఆతనికి అడ్డంకులను తొలగించి అమృత స్వర్లోకమును, సూర్యలోకమును, అమృతానందమును ప్రసాదించుచున్నారు.

ఇదే వేదరహస్యవేత్తల మార్గము. వారు జీవితమును సృజనాత్మక దైవ వ్యక్తీకరణముగా స్థిరపరచి, వ్యక్తియందలి అపరిపూర్ణతలను పరిపూర్ణ మొనర్చి, ఆ వ్యక్తిని, మానవచేతనకంటే ఉత్తమమైన స్పష పరిపూర్ణ జ్ఞాన శక్త్యానందముల వైపునకు తీసికొనిపోవుదురు. అదికూడ ఎక్కడోకాదు– ఇక్కడనే ఇప్పుడే ఈ విశాలప్రపంచముననే యనిరి. పరిపూర్ణజీవితమును సత్తాయొక్క సర్వదశములతోను ఋషులు కోరిరి.

"ఓ దేవతల్లారా ఆనందదాయకమైన మంచిని మా చెవులతో విననీ
ఓ పూజ్యులారా మా కనులతో ఆనందదాయకమైనవాటిని చూడనీ;

దృఢమైన శరీరము అంగములతోను స్తుతించెదము.
దేవతలచే ప్రసాదింపబడిన పరిపూర్ణ జీవిత
ప్రమాణమును అనుభవించెదము,
నూరు శశిరములు మా
ముంగట నిలవనీ"

ఇట్టి ఆదర్శమే వేద ఋషులు మన ముంగల ఉంచినది. తర్వాత హైందవ ఆధ్యాత్మ ఆకాంక్షలో వివిధమైన విధానములు ఏర్పడిననూ— హైందవ పరంపర ఈ తేజోవంతమైన విజ్ఞాన వెలుగు బాటలోనే విధేయతతో నడుచుచున్నది. తర్వాత కాలమున అనేక యోగ మార్గములు ఏర్పడినను, అవి ఈ వేదరహస్యవేత్తలు, ఆత్మ పరిపూర్ణము వైపునకు ఏర్పరచిన మార్గము వలననే ఏర్పడినవి.



# ఉపనిషత్తులు

"చూపు (దృష్టి) కలవారికి అది ఇక్కడనే ఈ లోకముననే"
(మండూకోపనిషత్)

వేద పరంపర ఉపనిషత్తులలో కాపాడబడినది. ఉపనిషత్తులను వేద దూరములనియు, వేద ధర్మత్యాగములనియు పాశ్చాత్య విజ్ఞానవంతులు తెలుపుటను శ్రీ అరవిందులు అంగీకరించరు. అవి వేద ధర్మమును వేరు భాషలో తెల్పుచున్నవనిరి. అవి వేద పరంపరనుండి ఏర్పడినవే యనిరి. నిజమునకవి, వేద జీవితము ముగిసిన కొంతకాలమునకు, ఆవేద ధర్మమును పునరుజ్జీవింప చేయుటకు జయప్రదముగా ఉపనిషత్తులు ప్రయత్నించినవి. కాలక్రమమున ఆంతరిక రహస్యమైనట్టిన్ని మరియు బాహ్య పూజాక్రమములు కలిగినట్టిన్ని వేదమతము నశించుటచే వివిధ క్షుద్ర విధానములు ప్రజ్వరిల్లినవి. ఈ క్షుద్ర విధానములు, వేదద్రష్టల విధానములకు సత్యదూరములుగా నుండినవి. అదృష్టవశాత్తు ఈ స్తబ్ధత, నాశనమునకు కారణముకాలేదు. తర్వాత కొన్ని నూర్ల సంవత్సరములకు సత్యవేద మతమును పునః ప్రతిష్టించుటకు ప్రయత్నము జరిగినది. ఒక విభాగమువారు ఉపనిషత్తులద్వారా వేదము యొక్క అగాధ ఆధ్యాత్మజ్ఞానమును తెల్పిరి. బ్రాహ్మణములచే యజ్ఞయాగముల చిహ్నములద్వారా బాహ్య విభాగమును తెల్పిరి. ఈ యజ్ఞయాగాది విధానములే బాహ్యముగా వేద ప్రతిపాదిత పూజా విధానమునకు మూలము.

వేదద్రష్టలు కనిన సత్యములను, ఉపనిషద్ద్రష్టలు తమయందు అనుభవమునకు తెచ్చికొని తగుకృషి సల్పిరి. ఆ కాలమున వారివారి మానవ మనోప్రవృత్తి ప్రకారము వారి విధానములు మారివుండవచ్చును. వేదకాలమునాటి

ద్రష్ట, స్ఫురణ జ్ఞానముచే సత్యమును దర్శించి తక్షణమే దానిని తన వికాస వంతమైన సత్తాతో అవగాహన చేసికొని అనుభవించెను. ఉపనిషద్ ఋషులు దాని విధానమును ప్రారంభదశగా పెట్టుకొని, తమ వికాసవంతమైన ఆత్మ జ్యోతి కారణము వలన తమయందు మనోశక్తులు వృద్ధిబొందుటచే, వారు వాటిని పరీక్షించి తెలిసికొనుచుండిరి. ఇట్టి వికాసవంతమైన మనస్సు జ్ఞానము నకు త్రోవగా ఏర్పడినది. కాని వారు వేద శృతిని తమ అనుభవ ఊహల కంటె ఉన్నత స్థితియందుంచిరి. ఎట్టి మార్గముకాని, పోకడకాని వేదముచే అంగీకరింపబడి, నిర్ధారణ చేయబడిననే తప్ప అన్యధా దానిని వారు అంగీక రించకుండిరి, ఎన్నోచోట్ల ఉపనిషద్ద్రష్టలు, వేదమిట్లు చెప్పుచున్నది అనిరి. ఉపనిషత్తులలో చెప్పబడిన సత్యములు, అంతర నిబంధనలు, మరియు సకల విద్యలు (మంత్రభాగములు) వేద ఋక్కులనుండి నేరుగా చెప్పబడినవే. వేదమునందలి వాటిని యధాతధముగానే ఉపనిషత్తులు మరలా చెప్పినారనుట కాదు, వాటి భావములను వృద్ధిపరచి, వాటి విచారములను విస్తృతిపరచి, తమజ్ఞానముతో వాటిని వికాసవంతముచేసి, వాటి పూర్వ విధానములకన్నా ఉత్తమముగాను అగాధముగాను ఒనర్చిరి. అయినను వారి అభివృద్ధి పూర్వా చార్యుల దృష్టి విదానములోనే సాగినది. తర్వాత వచ్చిన రాతలలో కొంత మార్పువచ్చినది, దైవ సత్యమును పూర్తిగా నొక్కి వాక్కాణించుచు ప్రపంచసత్యమునంతగా నొక్కిచెప్పరైరి. అట్లు చెప్పుటచే కాలక్రమేణ భ్రాంతి విదానము, లేక మాయావిదానమునకు తావిచ్చినది. పూర్వపు ఉపని షత్తులు, వాటిలో ప్రదానములైనవి వేద విదానమునే అనుసరించి, దైవమును ప్రపంచమును ఆద్యాత్మ్యమును జీవితమును, ఒకే సమరస విదానముతో ఆలింగనము చేసినవి, ఉపనిషద్ ఋషులు ద్రష్టలు, వేదద్రష్టల జ్ఞానమునే అవలంభించిరి. వారు దానిని పరీక్షించి అనుభవించి, ఆ యనుభవములద్వారా వాటిని విస్తృతపరచి ఆ కాలమునకు తగిన విధముగా తెల్పిరి.

ఆ జ్ఞానము ఏమిటి ?

# 2

ఉపనిషదృషులు విశ్వముయొక్క స్థిరమైన సత్యమును నేరుగా చూచిరి. అదిఅశ్వర్థ వృక్షమురీతి, అనంతము బహుళము అయిన సృష్టి కాని దాని మూలములు ఊర్ధ్వముగా నున్నవి, ఊర్ధముననుండి, దాని శాఖలు విస్తృతినొంది క్రిందకు విస్తరించియున్నవి. ఇక్కడ వున్నది. తనకు తానై ఏర్పడినదికాదు. తనకు తాను పూర్ణముకాదు. ఊర్ధ్వముపై ఆధారపడి దానినుండే సదా ఆ సత్యమును అందుకొనుచున్నది. వేదాంతమును ప్రతి పాదించు ఋషులా ఊర్ధ్వమునవుండు దానిని సత్యములో సత్యమనిరి. "సత్యస్యసత్య" అదే బ్రహ్మము. మానవ భాషచే దానిని చెప్పలేమనిరి. అది "తత్ మాత్రమే". "తచ్ బ్రహ్మ". ఇదిప్రపంచము, అందుండి వచ్చినది. వ్యక్తీకరణము అయిన దాని వెనుకది. అవ్యక్తము, దానిని ఇది, ఇది. అని ఎవ్వరూ చెప్పలేరు. దానిని ఇదికాదు, ఇదికాదు, ఇదికాదు అని మాత్రమే చెప్పవచ్చును. 'నేతి' 'నేతి'. కాని ఋషిదీనినే పరమ సత్యముగా చెప్పలేదు. వ్యక్తా వ్యక్తములకు ఊర్ధ్వమున 'పరాత్పరుడు' వున్నాడు అందురు. 'అత్యుత్తమ పురుష' యని యనవచ్చును. 'అవ్యక్తాత్ తు పరాఃపురుష' అతీత పురుషుని సత్తానుండి సర్వసత్తాలు ఉత్పన్నమగుచున్నవి. ఆయనే అత్యుత్తమము. ఆయనకు మించి ఏమిన్నిలేదు.

సర్వ సృష్టి, సర్వనామములు, ఆకృతులు అగ్నినుండి మిణుగురులు వలె ఆయననుండి ఏర్పడినవే. "విస్ఫులింగ ఇవపావకాత్" సాలీడుగూడు సాలీడునుంచి ఎట్లో అట్లే ఆయననుండి సర్వ ప్రపంచములు, పుట్టి ఏర్ప డినవి. దేవతలుకూడ ఆయన విభూతులే. వ్యక్తము అవ్యక్తము సత్యముగా ఈ రెండు ఆయన అవస్థలే. ఒకే ఉత్తమ పురుషునినుండి ఏర్పడినవి. ఒకటి స్థిరమైనది రెండవది శక్తిమంతమైనది. ఆయనే తన శక్తిద్వారా బయటకు

వచ్చి బహుళములుగా విస్తరించి యున్నాడు. ఉపనిషత్తుల భావములలో చెప్ప వలెనంటే ఆయన ఒకడే. బహుళముగా నుండుటను కోరినాడు, అని యన వచ్చును. కోరికతో తనను తనసుండి సృష్టించుకున్నాడు. సృష్టిచేసి అన్నిటి యందు ప్రవేసించినాడు. సర్వాకృతులయందు ఆయన వెలసియున్నాడు. సర్వము ఆయన నివాసములే. ఈ సర్వము బ్రహ్మము మాత్రమే. ఈ ప్రపంచమే బ్రహ్మము. ''బ్రహ్మేవ ఇదం విశ్వమిదం పరిష్టం''.

ఇది సత్యస్థితియొక్క పునాది. ఉపనిషత్తులు దీనిమీదఆధారపడి దానిని తెలిసి అనుభవించ మనినవి. మానవుని అజ్ఞానముచే అది వారికి మరుగున వున్నది. అతని మనో కవాటములు బాహ్యమునకు తెరచికొని యుండుటచే. తన సత్తాయందుండెడి 'అతిథి' ని తెలిసి, అనుభవించలేకున్నాడు. అటులనే ఇతరులలో నివసించువానిని కనుగొనలేకున్నాడు. ఉపనిషత్తులు పలువురిలోను పలు విధములుగా వ్యక్తీకరింప బడిన ఏకైక సత్యమును తెలిసి, ఆత్మతో తాను తాదాత్మ్యత మొందమని చెప్పినవి. ఏకమును, ఆత్మను, బ్రహ్మమును తెలిసికొనడమనగా బ్రహ్మమేమిగా ఉన్నదో దానిభావమును బొందుటే. ఉపని షత్తులుబ్రహ్మమును సత్యము, జ్ఞానము, అనంతము అనినవి. ''సత్యం జ్ఞానంఅనంతం''

ఆయనను ఏకైక కేవలసత్యముగా తెలియవలెను. పరమునందే సత్యముకాక ఇహమునందు, ఇక్కడను కూడ సత్యమును తెలియవలెను. ఈ సర్వము ఒకే సత్యము. చలమునందు దాని స్వధర్మ విధానముతోను' వ్యక్తీకరణమందు ప్రతి ఆకృతి దాని కార్యజ్ఞానముతోను, వున్నవి. ఎవరైతే ఉత్తమ దైవముతో తాదాత్మ్యమును చెందెదరో వారిజ్ఞానముతో వృద్ధిబొందెదరు బ్రహ్మము తుదిలేనిది; అనంతము. ఆయనచే పొందబడిన అతని పరిమితులు ఉదేశముతో ఏర్పరచబడినది. ఆయన పరిపూర్ణత్వము. సర్వ పూర్ణతలు

ఆయననుండి తీసివేయ బడిననూ ఆయన పరిపూర్ణత్వమునకు ఏమాత్రము కొదువలేదు. ఎవరైతే బ్రహ్మమువైపు వృద్ధిపొందెదరో వారాయన అనంతత్వమునకు వృద్ధిపొందెదరు. అనంతమే సంతోషము, ఆనందము. ఆనందముగానే బ్రహ్మమును అనుభవించవలెనని, ఉపనిషత్తులు చెప్పుచున్నవి. సర్వవ్యక్తీకరణములు నిజమునకీ ఆనందముచే. అనంత బహుళములుగా ఆయన దేహమునుండి ఉద్దేశ్యపూర్వకముగా ఏర్పడినవి. ఆనందమే సర్వజీవిత రహస్యము. ఎవరైతే యీ సత్యమువైపుకు పురోగమించెదరో వారి సర్వస్థితులు ఆయన వైపునకే కోరుచున్నవి;

ఇదే అమృతత్వ భావము. ఇదే వేదాంత ఋషులు గ్రహించిన గమ్యము. అమృతత్వము ఎక్కడనో మరణానంతరమున కాక ఇక్కడనే. ఇప్పుడే, ఈ దేహముతో నున్నపుడే, ఏర్పడ వలెను. "ఇహఏవ శాంతః"

## 3

ఉపనిషత్తులు బ్రహ్మజ్ఞానమునే వెల్లడిచేయుటలేదు దానిని పొందు మార్గమును తెల్పినవి. సాధకుల తత్వానుసారముగా, అంతర సాధనా మార్గములు ఏర్పరచినవి. పలు విధములుగా పలు త్రోవలతో ఏకైక బ్రహ్మము చేరు మార్గములను చెప్పినవి. అడ్డంకులు లేని చక్కని మార్గము, ఆయనను మనలోని అంతర అగాధములో కోరుటే. రహస్య సత్తాయందుండుట నేర్చి వస్తువుల హృదయ గహ్వరమునవుంటూ, ఆత్మ ప్రకాశించుచున్నది. ఆయనే కాలానికి పూర్వుడుకూడ. ఆత్మను ఉచ్చమైన బోధనలతోగాని, అధ్యయనముతోగాని మిక్కిలి పాండిత్యముతోగాని గెలువలేమని శృతులు తెల్పుచున్నవి. తన చేతనను, సర్వ చలనములయందు పవిత్రమొనర్చి, తన ఏకాగ్రతను, అంతస్తునకు మరలించవలెను. నమ్మికతోను, పట్టుదలతోను, ఆకాంక్ష

పరుడు, తనలోని సత్తాలోతునకు అధికాధికముగాపోయి, ఆత్మపై ఏర్పడిన అనేక గ్రంధులను; గడ్డిపోచపై పొట్టును వాడియైన చాకుతో తీసినట్లు, విడ తీయవలెను. అంతేకాక దైవకృపకొరకు వేచియుండవలెను. ప్రయత్నము చేత మాత్రమే ఆత్మ జయింపబడదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. దైవ కృపనుపొంది, ఆత్మ ఎన్నుకొనిన వారికే తనను విశదపరచుకొనును అని తెలుపబడినది.

దైవముతోడి ఈ తాదాత్మ్యము, దేహము వుండగనే పొందసలయును అట్లు కానిచో వినాశముతో దానిని పొందలేము. ఈ ప్రపంచమున మనమేమి కాలేమో ఇతర లోకములలోను అది మనము కాలేము. ఆయన వ్యక్తి అద్భుత ప్రపంచములందు తదనుగుణ దేహమును ధరించి వుండుటకు, అధి కారముకావలెనన్న, మనము మన ఆత్మ స్వాతంత్రమునుపొంది, అందుండు టకు నేర్వవలయును. ముక్తమానవులు అంతరవిముక్తిని జీవితానంతరమున కోరరు. ముక్తమానవుడు ఈ ప్రపంచమున ఆత్మ ప్రభువై, ఆత్మలో ఆనం దమనుభవించుచు ఆత్మతో ఏకీభవించి, ఆత్మానందమును వెదజల్లును. అజ్ఞాన ద్వైతములచే బాధింపబడదు. పరిపూర్ణ జ్ఞానమును పొందినవారికి మోహ మెక్కడిది? చింత ఎక్కడిది? దేనికి భయమొంద వలెను? దేనివైపు మరల వలయును? ఆయనకు సర్వమూ బ్రహ్మమే. సర్వమూ తన ఆత్మే. అతను ఇతరులతోను, దైవముతోను, సూర్యునితోను, అనంత ఆత్మతోను ఏకత్వ మును పొందినవాడే, ఆయన మృత్యుంజయుడుకూడ.



# గీతా ధర్మము

ఉపనిషత్తులు వేదమంత్రములందలి సారమును నూతనముగా ఏర్పరచిన విధానము వలెనే. భగవద్గీత వేదోద్దేశ్యమును, అనుభవములను, ప్రత్యక్షముగా సమన్వయ పరచి, ఉపనిషత్కాలము తర్వాతివారి అనుభవముల అభివృద్ధుల పొందుపరచి ఏర్పరచబడినట్టిదిగా తెలియుచున్నది.

భగవద్గీత మహాభారతమునందు ఒక సమగ్రము, సంపూర్ణము ఐన భాగము. భగవద్గీత వలన మహాభారతము ఆధ్యాత్మిక విషయముల తెల్పు గ్రంధరాజమని వినతి కెక్కినది. స్థలమా కురుక్షేత్రము. యుద్ధభూమి. సందేశమిచ్చువాడా. అవతార పురుషుడగు ఆ దివ్య ప్రభువే. ఈఉత్తమోత్తమ వచనములను వినువాడా ఆకాక్షించు మానవుడు. మరియు పరిణామ ముఖమున వుండిన ఉత్తమ మానవుడు. సందర్భమా మానవతా ప్రకృతి వలన బహుముఖ తాకిడులచేతను వత్తిడులచేతను ఏర్పడియున్న క్లిష్ట సమయము. వీరుడు పురుషశ్రేష్ఠుడు అయిన అర్జునుడే ఆ సమయమందు విభ్రాంతిచెంది తనకుండు శక్తిస్థోమతలు చాలవని శ్రీ కృష్ణుని ముంగల మోకరిల్లి; విమోచనముచేయు శక్తికొరకు ఆ పరమ పురుషుని ప్రార్థించెను. ఈ జీవిత మేమిటి? ఈ చలనము లేమిటి? మానవుడంటే ఏమి? మానవుడు ఎందుకు ఎక్కడికి ఈ విధముగా నడుపబడుచున్నాడు? అతనికి గమ్యమనునది ఏదైనావుంటే ఆ గమ్యమేమి?

# 2

శ్రీ కృష్ణ ప్రభువిట్లు చెప్పియున్నారు. ఈ ప్రపంచములు తనచే సృష్టింపబడినవి. ఈ విశ్వమందలి సృష్టిలో తానే ప్రవేశించి, ప్రతి రూప మునూ తానే తయారుచేసికొని, ప్రతి జీవ వ్యక్తియందు తాను నివసించి యున్నాడు. సర్వసత్తాలు, సర్వ అవస్థలు, సర్వచలనములు, తన సునిశిత శక్తిచే యంత్రి మందధిరోహించి ఆయన పాలించునట్లున్నది. ఆయన దైవత్వమిందుండి, ఈ నశ్వర ప్రపంచమునకాయన యిచ్చు ఆజ్ఞలచే; ఈ ప్రపంచము సత్యము మరియు దైవత్వమని యనుటకు ఇది ఒక నిదర్శనము మార్పు చెందునట్టిన్ని, నామాకృతులు గలిగినట్టిన్ని, సృష్టి పై విద్యముచేత ను ఏర్పడిన ప్రపంచ వ్యక్తీకరణము, దైవసత్తానుండి ఆవిర్భవించినదని చెప్పుట సత్యదూరముకాదు,

చలన బహుళము, మరియు స్థూలస్థితిపై ఆధారపడియుండుటచే ఆ దైవ ఉనికి, విస్తరించిననూ, విభజింపబడని ఒకసత్తా, లేక సర్వవ్యాపియగు దైవము ఒక (లీలగా యున్నది) నటనగా యున్నది. ఆత్మ అస్థిర స్థితిని "క్షరబ్రహ్మము", ఆత్మ స్థిర స్థితిని "అక్షరబ్రహ్మము" నిలబెట్టుచున్నది. పరిమితత్వము అనంతత్వముపై వెలసినది. అపరిమిత అనంతాత్మే అభివ్యక్త మందు బహుళ దామాకృతుల దాల్చి, విస్తరించి యున్నది. ఆ యపరిమిత అనంతాత్మే చలనములకు నిష్పక్షపాత బుద్ధితో ఆధారమిచ్చుచున్నది.

ఇదే సర్వమూకాదు. పరిమిత అపరిమితముల వెనుక, పురుషు డుండుట పురుషుడు లేకుండుట అను దాని వెనుక, పురుషోత్తముడు లేక అత్యుత్తమ పురుషుడు, అత్యుత్తమమున వున్నాడు. క్షరాక్షరములు ఉత్తమ సత్తాయొక్క అవస్థలే. సర్వము ఆయననుండే ఏర్పడుచున్నవి. సర్వము

ఆయన శక్తిచే అనగా ప్రకృతి లేక మాయచే పాలింపబడుచున్నవి. ఆయన స్వస్థితియందు సర్వోత్తముడై యుండిన్ని, విస్తృతియందాయన, విశ్వముగా తననుతాను ఏర్పరచికొని యున్నాడు. ఇంకనూ సర్వ సత్తాలయందు ప్రత్యేకముగా ఆయన స్వకీయమైన ప్రకృతియొక్క అణుభాగము, జీవుడుగా ఏర్పడి, కట్టుబడి యున్నాడు.

ఇట్టి స్థితియొక్క సత్యమునే మానవుడు అర్థము చేసికొనవలయును. జీవితమునకు కన్పట్టు భావమునకన్న వేరుగా అగాధమైన భావమున్నది. జన్మమెత్తి సుఖదుఃఖముల త్రోవలో, ఆశా నిరాశలతో, గాలిలో తేలియాడెడి ఎండుటాకువలె జీవించుట మానవ జీవితోద్దేశ్యము కాదు. అది అజ్ఞానము అను ముద్రపడిన జీవితముగానే యున్నది. మానవుడు కోరికలచే వుండినంత వరకే అజ్ఞాన జీవితమును నడుపును. ఆతను మేల్కొని - తన పరిమిత ఆత్మకన్న విశాలతర సత్యము - వేరొక ఉత్తమ శక్తి వున్నదని గ్రహించవలయును. ప్రపంచము, దాని యందలి సత్తాలు, శక్తులు, అధికారములు, అన్నియు ఆ ప్రభువుయొక్క అభివ్యక్తములే. సర్వములు ఆయనవే, సర్వము ఆయనయందే వసించి యున్నవి. ఆయన సర్వశక్తి సంపన్నుడు. సర్వ వ్యాపకుడు. మానవుడు ఇచ్ఛా దృష్టి నమ్మికలచే తన పరిమితత్వము నుండి, ఉత్తమ సత్తాకు, ప్రభువైన దైము వైపుకు వృద్ధి పొందవలయును. అట్లు వృద్ధిపొందిన ఆయన వర్ధమాన సత్తాలను అవగాహన చేసికొనవచ్చును. అనగా వ్యష్టి, సమిష్టి, అతీతమును అర్థము చేసికొనవచ్చును. ఈ కార్యమును సన్యాస జీవితమందుకాక, సాధారణ విస్తృత కర్మ ద్వారానే, ఈ జీవితమునందే, ఆ దైవ శక్తియొక్క పరమోద్దేశ్యమును నెరవేర్చవలయును. ఈ గమ్యము కొరకు శాస్త్రము, పలు విధ శిక్షణలను వృద్ధి పరచి ఆదేసించినది. మానవుని వివిధ ప్రకృతుల కనుగుణ్యముగా, సమగ్ర శిక్షణా విధానములను ఏర్పరచినదే ఈ భగవద్గీత.

# 3

నీవొనర్చవలసిన కార్యములు దైవ నిర్దేశ్యములని తలంచుము. ఆ కర్మ ఫలమును సర్వమునకు ప్రభువగు ఆయనకే అర్పింపుము. కోరిక రహితుడవుకమ్ము. సమతను పొందుము. మానసికమునందుకాని హృదయము నందుకాని విచక్షణ అనవసరము. కర్మ ఫలమునకు అనసక్తుడవు కమ్ము. ఏలన అవి ఆయనవే, ఆయన తన ఇచ్ఛ ప్రకారము ఆ కర్మలను నెరవేర్చుకొనును, ఇట్టిదే దివ్యమైన కర్మ మార్గము.

క్రమేణ కర్మలు చేయుట, చేయించుట, అను భ్రాంతి నశించును. ఉత్తమ శక్తే, విశ్వ ప్రభావమే, తాను కోరిన ఉపకరణములద్వారా కర్మలు చేసి, వాటి ఫలితములను ఏర్పరచుట తెలిసికొనగలవు. నీవు ఒక తెలియని, అసహాయమైన, ఉపకరణము మాత్రముగానే యున్నావు. కాని నీవుకోరిన, చైతన్యవంతమైన, ఇచ్ఛాపూర్వక ఉపకరణము కూడ కాగలవు. నిన్ను నీవు అర్థము చేసికొనుటను నేర్చుకో. నీ ఇచ్ఛను ఉత్తమేచ్ఛతో తాదాత్మ్యము పొందించుము. అట్లుచేసిన సర్వమందు అవ్యక్తముగా వుండే దైవశక్తిని నడిపించు వాడవగుదువు. విశ్వచేతనా శక్తిని, తెలియుటను వృద్ధిపరచుకొని దానికి అధికాధికముగా అర్పించుకొనుటను నేర్చి, దానితో పరిపూర్ణ తాదాత్మ్యము ను బొందుటే తర్వాతి మెట్టు. అదే జ్ఞానమార్గము.

విశ్వశక్తి తనను తాను తెల్పికొని దానిని శక్తిగా అనుభవించవలెను. అది ఉత్తమ ప్రభువు లేక పురుషోత్తముని స్వభావమేయని ఎరుగవలయును. ఆ పురుషోత్తముడు సర్వమునకు అతీతుడైననూ సర్వమునూ సృష్టించి, శక్తి ద్వారా సర్వమును పాలించుచున్నాడు. దీనినే ఆయన మాయాశక్తియందురు. ఇట్టి స్థితిలో ఆయనే (పురుషోత్తముడే) గురువు. మనసత్తాకు ప్రభువుకూడ. ఆయన పైపునకే మన ఆత్మ. మరియు మనో జ్ఞానములు ప్రవహించును.

ఆకాంక్షించు మనస్సు, జీవితముయొక్క నిబంధనలు, ఆదర్శములు, ఆయన ఉత్తమ సత్తా వైపునకే మరలును. ఆ పురుషోత్తముని చేతులలోనికి నిన్ను అర్పించుకొనుట, ఆయన ఏకైక ఇచ్ఛతో, నీ ఇచ్ఛను చేర్చుట యను అనుభవము అత్యుత్తమ మైనదే కాక మహోత్కృష్టమైన ఆనంద పారవశ్యము. తర్వాతి మెట్టు ప్రేమ మార్గము. కర్మ మార్గమున మన ఇచ్ఛ పవిత్రమొంది జ్ఞాన మార్గమున మనస్సు ఉత్తమునకు అభివృద్దిజెంది, వికాసవంతమగుటచే, ప్రేమ మార్గమున ఆ పురుషోత్తముని ఆనంద ప్రేమవాహినియందు ఓలలాడి అర్పించుకొనిన, మన హృదయము తన ఏకైక ప్రభువు ఆ పురుషోత్తముడే యని అనుభూతి చెందును. ఆయన యందే జీవించగలము. ఆయనతోనే ఆయన లీలయందే ఆనందమొందగలము.

ఇదే గీతాసందేశము. మానవునియొక్కయు, ప్రపంచముయొక్కయు స్వర్గముయొక్కయు బాధ్యతలను సమరస పరచుకొని, స్థిరీకరించు కొనవలయును. బాహ్యాభ్యంతరములు రెండునూ ఒకదాని నొకటి ఆలింగనము చేసికొని క్రమాభివృద్ది జెందవలయును. మరికొన్ని విలువ కట్టజాలని సత్యములు తలంపులు కలవు. కొన్ని నూతనములు మరికొన్ని పురాతనములు ఐననూ సరిక్రొత్త విధానముగా ఏర్పరచబడి, హైందవ ఆధ్యాత్మిక విద్యావిధానమందు బహు విధములుగా సంగ్రహింపబడి యున్నవి. వాటిని గురించి చెప్పుట ప్రకృత విషయమునందనవసరము. ఉత్తమ గ్రంథమగు గీతయందు చెప్పబడిన విషయముల కొంతవరకు తఱచి చూడగలిగితిమి. ఈ విషయములతో ఉపనిషత్తులుకూడ సమ్మతించుటను అవగాహన చేసికొన గలిగితిమి. అంతే కాక శ్రీఅరవిందుల బోధలయొక్క పునాదుల, అనగా దైవము, మానవుడు మరియు ప్రకృతి, దైవ వ్యక్తీకరణముయొక్క సామరస్యతను స్థిరీకరించుటను, కనుగొనగలిగితిమి. ఇట్టి గీతా ధర్మమును మానవులందరు గ్రహించి ఆ త్రోవను నడిచిన, దివ్యజీవనమును గడపగలము.

# అర్చన

''మానవులు ఎందుకు దైవమునర్చించెదరు?

అర్చన చేయుటకన్న "అది"గా యగుటే మేలు. సోమరులగుట చేతనే మార్పు చెందుటకు అర్చన చేయుదురు" పై ఆదేశమునకు మరి కొంత శ్రీతల్లిగారే చేర్చిరి.

''మార్పు అను పద్ధతి పైననే అర్చన చేయకపోవచ్చును. ఏలన రెండు విషయములూ కావలెననువారున్నారు. అనగా అర్చన మరియు మార్పు ఈ రెండూ వద్దను వారూ ఉన్నారు".

అర్చనకు; అర్చనచేయువారు అర్చింపబడునది కావలయును. అర్చన ద్వైతముమీద ఆధారపడియున్నది. ఏలన పూజ్యతకు, రాజు ప్రజ, యజమాని సేవకుడు, ప్రేమింపబడునది ప్రేమించునది, ఏకము బహుత్వము కావలయును. దైవము తనకుతాను కోరుకొని ''సోఽకామయత'' తనను తాను అంగీకరించుకొని "తదైక్షత" తనను తాను శక్తిమంతము చేసికొనెను. "సతపోతప్యత". ఇట్టి దైవ సమ్మతము వలన తనను తాను అంచనా వేసు వేసికొనుట చేతనే దైవము సృష్టిగా ఏర్పడినది.

మానవులెందుకు అర్చించవలయును?

లేక ఎందుకు ఆరాధించవలయును?

మానవులు అసహాయులు. దైవము తనను తాను ఆరాధించుకొని మానవుడైనాడు. ఈ భ్రమణము పూర్తి కావలయును. అనగా మానవుడు

ఆరాధనచేసి దైవము కావలయును. కాని ఈ రెండు ఆరాధనలకు వైవిధ్యము కలదు. అది దైవేచ్ఛ 'కామకళ'. సృష్టి స్థితికివచ్చు సందర్భమున ఎన్నో వికృత మలుపులు పొందుటచే, ఆ కేవల పూజ్యత ఈ ప్రపంచమునందు మానవులచే అర్చనగా మారినది. దైవత్వము వల్ల ఏర్పడినదే అర్చన. మానవ సత్తాయందలి కొన్నిభాగములు నిస్సందేహముగా పూజింపబడ వలనవే. ఈ యారాధన ఆరాధింపబడు దానిని అధిగమించ వలయును. అను ఉద్దేశ్యముతో ఉండవలయును, అనగా తనను తాను అధిగమించి ఆరాధ్యముగా మారవలయును. ఇక్కడ మార్పు అన ఏమి? అనుప్రశ్న ఏర్పడును. ఒక స్థితినుండి ఉత్తమ స్థితికి మారుటే యీ మార్పు. దైవముయొక్క ప్రథమ కేవల ఆరాధన కేవల సంభూతిగా ఏర్పడుచున్నది. దైవము సృష్టి చేసి, అందులో ప్రవేసించి, అదేయగుచున్నాడు. దివ్య ప్రభువు తన ఆనందమునందు సృష్టిని కలిగించుచున్నాడు. వేదములు చెప్పినట్టిది గొప్ప యజ్ఞము అర్చనా కార్యక్రమము. ఇందు ఆది పురుషుడు ఈ యజ్ఞమందు తనను తాను అర్పించు కొనుచున్నాడు (బలి యగుచున్నాడు). దైవము మానవుడగుటకు ఎంతో సంతోషముతో తనను తాను అర్పించుకొనుచున్నాడు. కాని మానవుడు దైవమగుటకు తానంతగా అర్పించుకొన లేకున్నాడు. దైవము తన్నారాధించు కొనుటలో కృతకృత్యుడైనాడు కాని, మానవుడా యారాధనతోనే నిలబడు చున్నాడు. స్వతహాగా మానవ సత్తాయందలి జడత్వము, సోమరితనము, తమోగుణము, ఈ మూడే చిత్తభ్రమకు మూలకారణములు; ఐక్యతే దాని కారణము, స్థితి, యని తెలిసికూడ, ఈ సృష్టి వైవిద్యమును అంటిపెట్టుకొని యున్నది. మానవుడు పరిమితిని ఏర్పరచుకొని వాటి మధ్యనే ఉండుట కాపించుచున్నాడు పరిమితత్వముచే స్థిరపడికూడ అనంతత్వమును కోరుచున్నాడు. మానవుడు తన పరిమితానందమున మునిగి ఉత్తమానందమును ఆపించును. మానవుడు తనకు దైవమునకు ఉండు ఎడమును లేకుండ చేసికొనక,

అర్చన, ఆరాధన, ఉపాసన యను వారధిని ఏర్పరచుకొని యున్నాడు. మానవుడు మార్పుకు సోమరియగుట చేతనే అర్చన యను దానిని చేయు చున్నాడని శ్రీతల్లిగారనిరి. ఎప్పుడైతే సోమరితనము పోవునో, అప్పుడే సత్యము నెరవేరును. మన ఉపాసన నిజాయితి కలది, సత్యమైనది అయిన స్వచ్ఛ ప్రకాశమైనదైన, సోమరితనమును తరిమి, ఆ యారాధన సర్వసత్తాల యందు సర్వ భాగములయందు వ్యాపించును. అర్పణను అధికాధికముగా చేసికొనుటను నేర్చిన ఆకాంక్ష పరిసమాప్తియగుటకు వీలగును. సర్వము ఊర్ధ్వమునకు ప్రజ్వలించు అగ్నిశిఖయై. ఆరాధించువాడు ఆరాధ్యమగును. ఇటువంటిదే పవిత్రారాధన. ఇది అర్పణ, ఆత్మ సమర్పణలమీద ఆధారపడి. మార్పుచెంది, దైవముగా మారుటకు వీలున్నది. అందువలననే తంత్ర శాస్త్రము "తాను దైవమై దైవమును పూజించవలెను" అని అనుచున్నది. "శివో భూత్వా శివంయజేత్".

సాధనా విధానమున అర్చించనివారందరు మార్పును కోరనివారు అని చెప్పుట తప్పు అని శ్రీతల్లిగారనిరి. మార్పు చెందుటకుకాని, అర్చించుటకు కాని ఇష్టపడనివారు కోకొల్లలు. ప్రపంచ మిట్టివారితో నిండియున్నది. అత్యు త్తమ చేతన సృష్టికి దిగివచ్చినపుడు, దాని స్వంతభావములోను, వ్యతిరేక భావములలోను, మరియు విద్యా అవిద్యలలోను, మునిగి యున్నట్లగుపడు చున్నది. అత్యుత్తమ ఆనందము దిగివచ్చినప్పుడు, సంతోష భావముగను, బాధా భావముగను, అగుపడును. అదేవిధముగ కేవల ఆరాధ్యము సృష్టిలోకి దిగివచ్చినపుడు దాని వ్యతిరేక సాకార భావములూ కన్పట్టును. ఆరాధనకు వ్యతిరేకభావము విరక్తి. ఇందుకు సంస్కృత పదము "జుగుప్స" సరిగా యున్నది. "గోప్తుం ఇచ్ఛ" తనను తాను కాపాడుకొనవలెననే ఇచ్ఛ. భయము చేతనే తన్ను తాను కాపాడుకొనవలెను, అను ఇచ్ఛ ఎర్పడినది. ఇతరములచే భయమువలననే సృష్టియందు ద్వైవిధ్యము ఏర్పడినది, మరియు

పొతుకొనియున్న ప్రతిది తనను తాను ఇతరములనుండి రక్షించుకొనుటకు, జాగ్రత్తపడి, వ్యక్తిత్వమును ఏర్పరచికొని యున్నది. ప్రత్యేక వ్యక్తిత్వము నకీ యూరాధన ఒక సవాలుగా వుండుటచే, ఎవరు కానీ ఆరాధనయందు తన వక్తిత్వమును కోల్పోవుటను కోరడు. అందువలన విరక్తి, విరోధ భావము, తిరుగుబాటు భావము ఏర్పడియున్నవి. ఆరాధన వలననే ఆనందము, ఆరాధన వలననే పీడింపబడుటయు, యీ ప్రపంచమున ఒకదానికి ఒకటి తోడుగా ఉంటూవున్నవి. అందువలననే రక్షించుటకు వచ్చిన ఆయన శిలువపై చావ వలసి వచ్చినది.

—యస్. మీరా



